## Bibliographic Record Target

సూర్యనారాయణశాస్త్రి, మల్లాది, 1880-

ఆంధ్రదశరూపకము / ఇది మల్లాది సూర్యనారాయణశాస్త్రిచే రచింపఁబడినది.- 1. కూర్పు.- మద్రాస్ : మల్లాది సూర్యనారాయణశాస్త్రి, 1915.

iv, 105 p. ;19 cm.

Record no. 698

Sūryanārāyaṇaśāstri, Mallādi, 1880-

Āṃdhradaśarūpakamu / idi Mallādi Sūryanārāyaṇaśāstricē racimpam̐baḍinadi.- 1. kūrpu.- Madrās : Mallādi Sūryanārāyaṇaśāstri, 1915.

iv, 105 p. ;19 cm.

Record no. 698

# ANDHRA DASA RUPAKAMU.

(A TREATISE ON DRAMATURGY)

TRANSLATED

FROM

SANSKRIT

***BY***

**MALLADI SURYANARAYANA SASTRI**

AUTHOR OF

***Samskrita Kavijivitani, Uttararamacharitra &c.***

PRINTED BY

V. RAMASWAMY SASTRULU & SONS,

MADRAS.

 [Price As. 8.

**1915.**

C. RAMALINGA REDDY.

# ఆంధ్రదశరూపకము.

ఇది

శ్రీవేంకటగిరి సంస్థానప్రభువు లగు

శ్రీమహారాజా

శ్రీ వెలుగోటి రాజగోపాలకృష్ణయాచేంద్ర

బహద్దరు జి. సి. ఐ. ఇ. వారి సమాదరణంబున,

అమలాపురోన్నతాంగ్లపాఠశాలయందుఁ

బ్రధానాంధ్రోపాధ్యాయుఁడును బ్రస్తుతము

చెన్నపురియందలి యాంధ్రసాహిత్యపరిషత్తునందు

సంస్కృతాంధ్రపండితుఁడును

సంస్కృతకవిజీవితాద్యనేకకృతికర్తయు, నగు

మల్లాది సూర్యనారాయణశాస్త్రిచే

రచియింపఁబడి,

ప్రకటింపఁబడినది.

మొదటికూర్పు.

కాపీరైట్ రిజస్టర్డు.]          1915.          [వెల. అ. 0-8-0.

PRINTED BY

V. RAMASWAMY SASTRULU & SONS,

AT THE AUDI SARASWATY NILAYA PRESS,

69, MALIA PERUMALL STREET, MADRAS—1915.

# ఉపోద్ఘాతము.

విద్వద్వర్యులారా !

దేవవాణికిఁ గన్నకూఁతు రగునాంధ్రభాషాయోషామణి ఛందోవ్యాకరణకావ్యాలంకారాదిలక్షణంబుల నెల్లఁ దల్లిపోలికను బుడికి పుచ్చికొని యున్నతస్థితికి వచ్చి "దేశభాషలందుఁ దెలుఁగు లెస్స" యనిపించికొని వన్నె కెక్కినది గాని యొక్క రూపకలక్షణమున మాత్రము పరాకు నెందినది. ఇందులకుఁ గారణ మిది యని నిశ్చయింప రాదు గాని తొల్లి మనదేశమున రూపకప్రదర్శనవ్యవహారము లేక పోవుటయు, ననేకము లగుశ్రావ్యపాఠ్యకావ్యములు రచియించిన మన ప్రాచీనమహాకవులు దృశ్యకావ్యముల మాట దలపెట్ట కుండుటయు,నను నివి రెండు నన్యోన్యాశ్రయదోషంబునఁ గారణమై యుండవచ్చును. 17 వ, శతాబ్దము మొదటివాఁ డగు నెలకూచి బాలసరస్వతి 'కవిసమీహితరంగకౌముదీనామనాటకవిధానప్రతిష్ఠాఘనుండ' నని రాఘవయాదవపాండవీయమున వ్రాసికొనెను గాని యారంగకౌముది కాలవశంబున నామమాత్రముచేతనే విద్వన్మనోరంగ మలంకరింపఁ దగిన దయ్యె. తరువాత 18 వ శతాబ్ది మొదటివాఁ డగు కుందుర్తి, వేంకటాచలకవి "చాటుకృతులును బహువిధనాటకములు, బంధురతరార్థపూర్ణప్రబంధములును, రచనగావించి దేవతార్పణము సేసి, పాండ్యవిభుచేఁ బ్రభుత్వసంపదలు గనితి" అని యిప్పటి కాంధ్రసాహిత్యపరిషత్తుమూలముగాఁ దెలుఁగువారి కంటఁ బడినకార్తికమాహాత్మ్యములో వ్రాసికొని యుండెను గాని యానాటకములు దైవవశమున నిజముగా దేవతార్పితము లగుటచేతనే కాఁబోలు మానవులకు దొరకినట్లు తెలియ రాకున్నది. ఇఁక ఇటీవలఁ గాని పైని జెప్పినరెండుశతాబ్దములలోఁ గాని పెక్కండ్రు దాక్షిణాత్యు లగు నాంధ్రకవులు యక్షగానములు రచించినట్లు కనుపట్టుచున్నది గాని యవి దశవిధరూపకంబులలోఁ జేరఁదగినవి గావు. పేరునకు దశరూపకములలోఁ జేరినది శ్రీనాథునివీథి యొకటిగలదు గాని యది వీథీనియమమును బాటింపని వీథి యయ్యె. ఏ మయిన నేమి ? మనదేశమునఁ బూర్వకాలమున రూపక

రచనయు లేదు. వానిఁ బ్రదర్శించు నాచారమును లేదు. ఈ రెంటిమూలముగాఁ దెలుఁగులో రూపకలక్షణంబును బయలువెడల లేదు.

తరువాత ననఁగా ముప్పదిసంవత్సరముల క్రిందట హిందీ పార్సీ నాటక సమాజములు మనదేశమున నాట్యశాలలు నిర్మించి రూపకములు ప్రదర్శించి వెళ్లినపిదపఁ దెలుఁగులో రూపకరచనబీజము దొలుత నాంధ్రీకరణరూపమున నంకురించి పిదప ననుకరణరూపమునఁ బెరిఁగి యాతట స్వకపోలకల్పనరూపమునఁ గొమ్మలు పెట్టి యిపు డిపుడు యథేచ్ఛముగా సహస్రముఖంబుల నన లెత్తుచున్నది. దీనికిం దగినట్లుగాఁ బ్రతిపురమును నాట్యశాలలును దినదినాభివృద్ధిఁ గాంచుచున్నవి. కావునను, "కావ్యేషు నాటకం రమ్యం, నాటకాంతం హి సాహిత్య' మ్మను నార్యోక్తులచే నెల్లకావ్యములయందును నాటకము మనోహరముగా నుండుననియు, వైదుష్యమణికి సానరాయియైననాటకమును జక్కగాఁ దెలిసికొనుటచే సాహిత్యజ్ఞానము సమాప్తి నొందు ననియు నాటకము ప్రశంస కెక్కి యుండుటచేతను, లక్షణము తెలియని నాటకాదిరచన మనుచితమై సరసస్థితికి రాఁజాలదు గావునను, దెలుఁగులో నిపుడు రూపకలక్షణ మావశ్యకమని విద్యాధికులు తలంపక పోరు. మఱియు నీ లోపమును దీర్చుటకై స్వతంత్రించి కల్పింపక సంస్కృతమందలి యీ లక్షణగ్రంథమును దెలిఁగింపఁ గడంగిన నా సాహసమును మన్నింపక పోరు.

సంస్కృతమందలి రూపలక్షణములలో నెల్ల భరతనాట్యశాస్త్రము బహువిధముల మొదటిదియైన, నది సర్వజన సాధారణముగా సులభముగా గ్రహింపఁ దగి యుండక వివిధము లగు నాట్యధర్మములను బలుతెఱంగుల నుపదేశించు పెద్దగ్రంథముగా నుండుటచేతను, ఇందలి యెల్లవిషయములను సంగ్రహించియే ధనంజయకవి దశరూపకమును రచియించినవాఁ డగుటచేతను, కథా నాయక రూపక రస విభాగంబున సుబోధకముగా నున్న దశరూపకము నాంధ్రీకరించుట యుత్తమ మనెడి నామిత్రుల ప్రోత్సాహముచే నేను దీనిఁ దెలిఁగించితిని. విలసను పండితుఁడుగూడ 'హిందూథియేటరు' అను విపులమైనయాంగ్లేయభాషావ్యాసము నీదశరూపకమును



సరిగా ననుసరించి వ్రాసె ననుటయే రూపకరచనమున నిది యెంతవఱకుఁ దగినసాహాయ్య మొనరింపఁదగునో తెలుపఁ గలదు. దీనికిఁ బిదప సరస్వతీకంఠాభరణము ప్రతాపరుద్రీయము మున్నగు కొన్నియలంకార లక్షణంబుల నాటకలక్షణమును సాహిత్యదర్పణమున సర్వరూపకలక్షణంబును నిర్వచింపఁ బడినవి గాని యివియన్నియుఁ గూడఁ గేవలరూపక ధర్మములనెల్ల నిర్ణయించుటయం దీదశరూపకమును బోలకున్న వనుటయు నిదియే సర్వవిధముల రూపకరచనమున సహాయము గాఁదగియున్న దని తెలుపఁ గలదు.

తొలుత సూత్రాత్మకముగా ధనంజయమహాకవి రచియించిన కేవలలక్షణమునకు ధనికుఁ డను మహాపండితుఁడు దశరూపావలోక మను పేరవివరణము వ్రాసి యాయాసుప్రసిద్ధ రూపకములయందలి శ్లోకములను లక్ష్యములుగా నుదాహరించెను. నేను వ్యాఖ్యానసహిత మగుదీని యందలి లక్షణములను లక్ష్యములను గూడ సరిగానే యాంధ్రీకరించుచు వచ్చితిని. అందు దాహరింపఁ బడినవానిలో భవభూతి రచియించిన మహావీరచరితోత్తరరామచరిత్రములలోని శ్లోకములు పెక్కు గలవు. ఈనాటకములు రెండును నేను దెలిఁగించి యుండుటచే నిం దుదాహరించునపుడు 'మదీయము' లనుచు వచ్చితిని. అందందు ధనికుఁ డుదాహరించినలక్ష్యములకు సరియయినపద్యములను నా సత్యకీర్తినాటిక ప్రతిజ్ఞాశాంతనవములనుండి కూడ నుదాహరించితిని. మఱియుఁ దెలుఁగులో నంతగాఁ బరిపాటిసేయఁదగని చిన్నచిన్న యంశములకు గ్రంథవిస్తరభీతిచే లక్షణములుమాత్రమే నిర్వచించి లక్ష్యము లుదాహరింపలేదు. భాషానిర్ణయ ప్రసంగంబున నందుఁ బాత్రములకు సంస్కృతప్రాకృతములు నిర్ణయించు సందర్భమున నిందు 'మక్కికిమక్కి' యనునట్లు వ్రాయుట యనుచితము గావునఁ గొందఱుత్తమపండితులయభిమతము ననుసరించి పాత్రములకు భాష నిర్ణయించితిని. ఈనూతనాంశముల యందలి నా సాహసమును విద్యావంతులు మన్నింతురు గాక యని కోరుచు ధనంజయమహాకవిని గూర్చి మున్ను నారచియించిన 'సంస్కృతకవిజీవితము' నుండి సంగ్రహించి తెల్పుటకు ముం దింకొక్కమాట వ్రాసెదను.

అంగ్లేయనాటకములవలె మనసంస్కృతాంధ్ర రూపకములంతగాఁ బ్రదర్శనరమ్యములు గావనియు నందులకు మననిబంధనములే కారణమనియుఁ

గొందఱుతలంచెదరు గాని యది సరిగాదు. అశుభాంతముగా రూపకము సమాప్తిచేయుట దక్కఁదక్కినకథాసన్నివేశాదికము - నాయకాదిపాత్రౌచిత్యమురసపోషణము ననుముఖ్యధర్మములు కవిప్రతిభ కధీనములై యున్నకెక్కఁదగి యుండ నిబంధనలేమిచేయును! కేవలమంగళాచరణమునకే కాక కొంచెముగాఁ గథ సూచింప నాందియు నంతకంటె వివరించుటకుఁ బ్రస్తావనయుఁ దోడ్పడఁ దగియుండవానివానియేమి! కవి స్తుతితోనిండక యుత్తరరామచరితమంనువలె నుండెనేని ప్రస్తావన రమ్యముగాదా? పేరునకు (Scenes) 'రంగములు' అనుపదమును మనవారు వాడలేదుగాని కథాస్థితినిబట్టి యొక్కొక్కయంకమున రెండుమూఁడుగూడ రంగములు పూర్వనాటకములఁ గనఁబడుచుండ నంకములేల విసుగుపుట్టింప నగును? ఇందులకు శాకుంతలోత్తరచరితమృచ్ఛకటికాదులలోని కొన్ని యంకములు ప్రమాణము. కావునరూపకరచన ప్రదర్శనములకు మననిబంధనములు సర్వథాసాధకములుగాని బాధకములుగా వని నాయభిప్రాయము. మిగిలిన యంశములనిదియే తెలుపఁగలదు.

## ధనంజయమహాకవి.

ఇతఁడు బ్రాహ్మణుఁడు. విష్ణువనువాతనిపుత్రుఁడు. సకలశాస్త్రివేత్త యయినలాక్షణికుఁడు. ధారానగరాధిపతియు శ్రీభోజమహారాజుపెదతండ్రియు వాక్పతిశా జనునామాంతరము గలవాఁడు నగు శ్రీముంజమహీపాలునియాస్థానములోనివిద్వత్కవి. ఇంతుల కీతనిదశరూపకంబుచివరనున్న "శ్లో. విష్ణో స్సుతేనాపి ధనంజయేన విద్వన్మనోరాగనిబంధహేతు అవిష్కృతం ముంజమహీశగోష్ఠీవైదగ్ధ్యభాజా దశరూప మేతత్" అను శ్లోకమే ప్రమాణము. క్రీ|| 1010–1051 నడుమ రాజ్యముచేసినశ్రీభోజునకుఁ బితృవ్యుఁ డగుశ్రీముంజుఁడు క్రీ, 996 ప్రాంతములో నున్నవాఁ డని తెలియుటచే నిక్కవియు నప్పటివాఁడే యనుట స్పష్టము.

విశేషాంశము:—ఈ గ్రంథము కొంతవఱకు ముద్రింపఁబడినపిదప నీకృతినాయకు లగుశ్రీ వేంకటగిరిమహారాజావారికి శ్రీజార్జిసార్వభౌముఁడు G. C. I. E. అనుబిరుద మొసంగినట్లు ప్రకటింపఁబడినదిగావున గ్రంథావతారికలోని K. C. I. E. అనుచోటఁ బైబిరుదమును బాఠకులు పఠింతురుగాక.

25-1-1915 }
చెన్నపురి. }

వల్లాది సూర్యనారాయణశాస్త్రి.

శ్రీరస్తు.

ఓమ్నమః పరబ్రహ్మణే.

# ఆంధ్రదశరూపకము.

## ప్రథమ ప్రకరణము.

### ఈశ్వరప్రార్థనాదికము.

శ్లో. సత్యం జ్ఞానం పరం బ్రహ్మ జగదాభాసభాసురమ్
స్వస్వరూపానుసంధానవేద్యం తత్త్వ ముపాస్మహే.

ఉ. శ్రీలలితాఖ్యశక్తి నలరించువిభావము విశ్వరూపని
ర్వ్యాలవికారజాలము భరించురసం బతినామరూపముల్
దాలిచి లోకరంగమునఁ దాండవ మాడునటుండు నౌవిభుం
డేలుతఁ గృష్ణయాచధరణీశ్వరు నిష్టశుభాఢ్యుఁ జేయుచున్.

గీ. ఎవనిదశవిధరూపంబు లెదఁ దలంచి
యనుకరించియు సరసులు హాయి నుంద
రఖిలవిదుఁ డైనయట్టినారాయణునకు
భరతమునికి నొనర్తును వందనములు.

గీ. దేనిఁ గని యెల్లలోకంబు దెలివిఁ జెందు
నట్టిసరసంపుఁగృతి సేయ నాదరంబు
గలుగఁజేయు సరస్వతి కరుణతోడ
నొక్కకకవీశ్వరునకు నొక్కొక్కవేళ.

గీ. సమధికానందరససుధాస్వాదఫలము
లైనరూపకములఁ గూడ సజ్ఞుఁ డెవ్వఁ
డరయు నితిహాసములమాడ్కి నట్టిదృశ్య
కావ్యరసదూరునకు నమస్కారశతము.

సీ. సర్వసమామ్నాయసారంబు సమకూర్చి
నాట్యవేదము నా నొనర్చె ధాత
తాండవం బనఁగ నుద్ధత మైననృత్యంబు
రచియించె శ్రీనటరాజరాజు
లాస్య మనంగఁ దాలలయాశ్రయం బైన
మృదులనృత్తంబు నిర్మించె గౌరి
నాట్యశాస్త్రాభిధానంబున నభినయ
పద్ధతిఁ గల్పించె భరతమౌని
గీ. యౌర! యివి యెల్ల వివరించునతఁడు గలఁడె
మఱియుఁ దెలియంగఁ జాలునే మందబుద్ధి
యంచు దశరూపకము సంగ్రహించినట్టి
సద్యశోధనజయు ధనంజయుఁ దలంతు.

ఉ. ఏగతి సంస్కృతంబునకు నీడయియాంధ్రమువన్నె కెక్కునో
యాగతి వ్రాసి లక్షణము లన్నియు రూపకలక్షణంబు నా
భాగముగా మిగిల్చిన కృపాపరతంత్రుల నాత్మఁ గొల్చెదన్
వాగనుశాసనాదులను వ్రాసినవాగనుశాసనాదులన్.

గ్రంథారంభణసమర్థనము.

ఉ. వీనులవిందు కన్నుఁగవవేడుక నాలుకతీపి యై కథా
ధీనము గాఁగ బుద్ధి రసదీప్తము గాఁగ మనంబు మేను భా



వానుగతంబు గాఁగఁ గరినాత్మున కైన ముదంబు నీతి వి
జ్ఞాన మొసంగు కావ్యము నిజంబుగ రూపక మెంచిచూడఁగన్.
చ. కవిచతురాననప్రతిభఁ గల్పిత మైనవిచిత్రసృష్టికిం
దవిలిన దేశకాలసురదానవమానవవృత్త మెల్ల ని
క్కువమనునట్లుగా నెదుటఁ గూరిచి చూపఁ జిత్తముల్ సుఖా
ర్ణవమున నోలలాడ్చుకృతిరాజము రూపక మే తలంపఁగన్.
గీ. సరసశబ్దార్థవృత్తిభాసురవిలాస
రుచిరసదలంకృతిమనోజ్ఞరూప యయ్యు
నట్టికృతికాంత లోకవిఖ్యాతిఁ గాంచి
తనరు నె సలక్షణప్రవర్తనము లేక.

మ. ఇతివృత్తంబు తెఱం గెఱుంగక రసం బీక్షింప కజ్ఞాదిప
ద్ధతి భావింపక పాత్రధర్మములపొంతం బోక యౌచిత్యసం
గతి నర్థింపక యిచ్చ వచ్చినగతిన్ గర్వించి క్రీడించు దు
ష్కృతులాకాశపురాణమిత్రములు తుష్టిం జేయఁగాఁ జాలునే.
చ. సమయము మాఱెఁ గాకవులసంఖ్యయు హెచ్చెను దేవవాణి
మా, నమును వహించెఁ దెల్గు నవనాగరకాంగన యయ్యెఁ
బూర్వసూ, త్రములు రుచించు కాల మిది కాదని యూ
రక యుండవచ్చునే, యమవస పీఁటవట్టికొని యాఁగునె
పున్నమ రాకపోవునే?
గీ. అనుచు ననుచును దలఁచి దృశ్యంబు లైన
కావ్యముల కాంధ్రమందు లక్షణము లేని
లోపము దలంచి తలఁచి సుశ్లోకు లైన
శాస్త్రికర్తల గురువర్యు జనకపాదు.

గీ. ఒక్కచో సూత్రపంక్తి నింకొక్కచోటఁ
బద్యఫణితిని నొకయెడ గద్యసరణి
వస్తునాయకరూపక భావరసవి
భేదము సుబోధకము గఁ దెల్పెదనుగాక.

వ. అనియుం దలంచి యాంధ్రభాషాయోషామణి కభినవాలంకారంబు సమర్పించు కుతూహలంబున ధనంజయమహాకవి విరచితం బగుదశరూపకంబు నాంధ్రీకరింపఁ గృతనిశ్చయుండనై యుండి యతీతవసంతకాలంబున యథాపూర్వంబుగఁ బ్రకృతిరంజనంబున రాజశబ్దంబునకె కాక యందు మహత్త్వంబునకు భాజనం బగుట మహారాజనియు సంస్కృతాంధ్రపారీణు లగుబహువిద్వాంసులను బహూకరించుటనే కాకన్వయంబుగ విద్వాంసుఁ డగుట విద్వత్ప్రభు వనియుఁ బ్రశంస కెక్కిన మదభీష్టార్థప్రదాతయు మదీయకృతిధాతయు ననేకసత్కృతినేతయు నగు శ్రీరాజగోపాలకృష్ణయాచేంద్రమహారాజును సందర్శింప వేంకటగిరిపురంబున కేగినంత.

### వేంకటగిరిమహారాజ ప్రశంస.

గీ. పద్మనాయకకులకల్పపాదపాగ్ర
జనితరేచర్లగోత్రశాఖను జనించు
నిరువదెనిమిదియవసురుచిరఫలంబు
రాజగోపాలకృష్ణధరావరుండు.

క. సరసుండు కుమారేచమ
ధరణీనాథునకు శాంతిధరణీలక్ష్మి



నరసాంబకుఁ బుట్టినయే
డ్గురుకులగిరిధీరసుతులకుం బెద్ద యగున్.

సీ. ఘనుఁ డౌప్రతాపరుద్రుని మెప్పు గొనినయ
శీతివరంబులసింగవిభుఁడు
వరరసార్ణవసుధాకరముఖ్యకృతికర్త
సర్వజ్ఞసింగమక్ష్మావిభుండు
కృష్ణరాయలరిపు గెల్చుట వెలుగోటి
రా జైననిర్వాణరాయవిభుఁడు
అధికసంగ్రామజయార్జిత శూరేంద్ర
యశముఁ గాంచినపెద్దయాచవిభుఁడు

గీ. ఎక్కుడుగ నగ్రహారంబు లిచ్చి జనకు
నంతవాఁ డైనబంగారుయాచవిభుఁడు
మున్ను గాఁ గలపూర్వులమూర్తిమంత
మైనగుణరాశి శ్రీకృష్ణయాచవిభుఁడు.

సీ. సప్తసంతానముల్ సంతరించి నవసం
తానుఁ డైనకుమారనరవరుండు
తారరత్నమితాగ్రహారుఁ డై యమితాగ్ర
హారంబు లిడినబంగారునృపుఁడు
ఆర్కాడ్నవాబు సహాయుఁ డై యాంగ్లేయ
గౌరవం బందుకుమారవిభుఁడు
అల వేంకటగిరీశుఁ డై కాశివిశ్వేశు
నిలిపినబంగారు నృపవరుండు

గీ. తండ్రి యును దాత ముత్తాత తాతతాత
గాఁగ నభిజాతుఁడై చిరకాలకలిత
విదితవేంకటగిరిరాజ్యవిభవుఁడైన
కృష్ణయాచేంద్రుకీర్తి వర్ణింపఁ దరమె!

సీ. ఏతేనియొకతమ్ముఁ డేలుచుండెను మహా
రాజన బొబ్బిలిరాజ్య మిపుడు
ఏధీరునొకతమ్ముఁ డిపు డేలు జటప్రోలు
సర్వాధికారప్రశస్తుఁ డగుచు
నేమాన్యసుతుఁడు మాతామహార్జిత మైన
తంగెళ్లమూడి కధ్యక్షుఁ డిపుడు
ఏజననాథునిరాజబంధువులు రా
జులు జమీందారులై వెలయుచుండి

గీ. రతఁడు రాజాధిరాజకీర్తితచరిత్ర
మహితపంచమజార్జిభూమండలేశ
దత్తబహుబిరుదాంచితోదార ధీర
కృష్ణయాచమహారాజు కేవలుండె!

సీ. తండ్రితాతలత్రోవఁ దప్పక సత్రాల
యాగ్రహారాదు లందం దొనర్చె
విక్టోరియారాణిపేరఁ జెన్నపురంబు
స్త్రీవైద్యశాల నిర్మింపఁ జేసె
నాంగ్లభాషావృద్ధి నర్థించి నెల్లూర
శాశ్వతోన్నతపాఠశాల నిలిపె



జరగునైరోపసంగరమునం దాంగ్లరా
జ్యమున కత్యర్థసాహాయ్య మొసఁగె

గీ. నాంధ్రసాహిత్యపరిషత్తనంతకీర్తి
వెలయఁ జెన్నపురంబున నిలిపె ననఁగఁ
బరఁగువెలుగోటి రాజగోపాలకృష్ణ
నృపునియౌదార్యమహిమ వర్ణింపఁ దరమె!

వ. ఇట్లు సకలైశ్వర్యసంపన్నుండు పుత్రపౌత్రాదిసంపత్పరిపూర్ణుండు లోకోపకారపరాయణుండు నీతికోవిదుండు రాజ్యతంత్రస్వతంత్రుం డుభయసాహితీకూలంకషశేముషీవిశేషుండు శ్రీరాజాపంచహజార్మనసబ్దార్ కే.సి.ఐ.ఇ. మహారాజేత్యాదిబిరుదావళీవిరాజమానుండు మితభాషణభూషణుండు గంభీరహృదయుండు నగునమ్మహారాజు పేరోలగంబుండి మదాగమనం బెఱింగి నన్నుఁ బిలిపించి సమాదరణపురస్సరంబుగ నుచితాసనాసీనుం గావించినంతఁ బ్రవృత్తం బగుసంస్కృతాంధ్రభాషావిషయకగోష్ఠిం బ్రసంగవశంబున—

ఉ. సన్నుతి కెక్కినట్టి కవిచంద్రుఁడు నన్నయభట్టు మున్ను గా
మొన్నటిదాఁకఁ గల్గుకవిముఖ్యులు బాసకుఁ జేసినట్టిమే
లెన్నుచు నింకఁ జేయఁ దగువృద్ధినిఁ దెల్పుచుఁ దెల్గుఁ గూ
ర్చినా, మున్నురచించువ్యాసమును మోదముతో విని
యాతఁ డిట్లనెన్.

దృశ్యకావ్యలక్షణంబు రచియింపు మని యానతిచ్చుట

చ. తల మొడ పీనులం గరపదంబుల సొమ్ములు దాల్చి మోమునం
దిలకము లేక యున్నగతి తెల్గున కబ్బెను దృశ్య లక్షణం

బాలయమిఁ గాని యాకొఱఁతయుం గనిపించక యుండె
మున్నర, చ్చల నటియింపరాక యిది సందుల గొందులఁ
బ్రొద్దుపుచ్చుటల్.

చ. బరి తెగి దృశ్యకావ్యవరవర్ణిని యిప్పుడు నాట్యశాలలన్
దరిసెన మిచ్చుచుండె వివిధంపువిలక్షణవేషభాషలన్
మురియుచుఁ బెక్కుపోకడలఁ బోవుచుఁ గాన సలక్షణంపుసం
చరణము దీనికిం దెలుపుసత్కృతి సల్పుము సత్కవీశ్వరా!

మ. అనియాభూవరుఁడానతీయమదిలో హర్షించి "రాజోత్తమా
మును నిర్మించె ధనంజయుం డొకకృతిన్ ముంజక్షితీశాజ్ఞ దా
నినినీయానతినిప్పుడేఁ దెలుఁగు నన్నిర్మింతు" నంచాయశో
ధనునంగీకృతినొందివెండియునువిద్యాగోష్ఠిఁగావించుచున్.

వ. పిదప నయ్యుదారుం డొనంగిన సముచితసత్కారంబుఁ గై
కొని యనుజ్ఞాతుఁడ నై యరుదెంచి.

కృతిసమర్పణము.

సీ. శ్రీమంతునకుఁ బుణ్యశీలదయార్జవ
ధైర్యసాహసగుణోదంచితునకు
శ్రీవేంకటగిరి ప్రసిద్ధరాజ్యేందిరా
రమణత సుమనోఽనురంజనునకు
శ్రీవెలుగోటి విస్తీర్ణాన్వవాయనీ
రాకరపూర్ణసుధాకరునకు
శ్రీరాజగోపాలకృష్ణయాచేంద్రధ
రావరునకు మహారాజునకును



గీ. అభిమతాభ్యుదయపరంపరాభివృద్ధి
గాఁగ నొనరించి నాయిచ్చుకాన్క యైన
యాంధ్రదశరూపకం బనునట్టి దృశ్య
కావ్యశాసనమున కుపక్రమ మెటు లన?

---

## గ్రంథారంభము.

### వస్తుప్రకాశము.

రూపకనిర్వచనము:—

అవస్థానుకరణము నాట్యము. ౧

కావ్యంబుల వర్ణింపఁబడిన ధీరోదాత్తాది నాయకుల యవస్థల నొకా నొకనటుండు సరిగా నభినయించి యనుకరించుట నాట్య మనఁబడును.

దృశ్యం బగుట రూపంబు. ౨

ఆనాట్యమే నీలపీతాది రూపముల వలెఁ జూడఁదగిన దగుటచే రూప మని చెప్పఁబడును.

ఆరోపంబున రూపకంబు. ౩

నటునియందు రామాదనాయకుల యవస్థల నారోపించుటచేఁ గలిగిన యారూపమే రూపక మనఁబడును.

రసాశ్రయం బైనయిది దశవిధంబు. ౪

శృంగారాది రసముల నాశ్రయించిన యీరూపకంబు, నాటకము, ప్రకరణము, భాణము, ప్రహసనము, డిమము, వ్యాయోగము, సమవాకారము, వీథి, అంకము, ఈహామృగము, ననునామంబులఁ బదివిధము లగుచు

న్నది. దీనింబట్టి ముందు చెప్పఁబోవు సంకీర్ణరూపకం బగునాటిక యీపరిశుద్ధ రూపకములలోనిది గా దని యెఱుంగునది. కాని "నృత్యభేదంబులైన భాణీ ప్రస్థాన రాసకాదు లగురూపకంబు లనేకంబు లుండఁగాఁ బదిరే యని యెట్లు నిశ్చయింపనగు" ననుశంక కిట్లు సమాధానమరయునది.

నృత్యవిభజనము:—

### నృత్య మన్యము. ౫

రసాశ్రయ మైననాట్యముకంటె భావాశ్రయం బగునృత్యము వేఱు. గాత్రవిక్షేపమే ప్రయోజనముగాఁ గలిగిన నృత్యమును జేయువాఁడు నర్తకుఁ డని చెప్పఁబడుటచేతను వాఁ డొనరించు నృత్యము ప్రేక్షణీయకమని లోకంబునందును లక్షణ గ్రంథములయందును వ్యవహరింపఁ బడుటచేతను నాటకాదులకంటె నృత్యము వేఱగుచున్నది. ఇంకనో నాటకాదులు రస విషయంబులు. రసమో విభావానుభావాది సంసర్గము గలది యై వాక్యార్థమే ప్రయోజనముగాఁ గలది యగును. కావుననే వాక్యభావము నభినయించు నాట్యము రసాశ్రయ మని తెలుపఁబడినది. కించిచ్చలనము గలది నాట్య మనఁబడును. గాత్రవిక్షేపము సమానమే యైనను అనుకరణాత్మక మైన నృత్తకముకంటె నృత్య మెట్లు వే ఱగునో యట్లే వాక్యార్థాభినయాత్మక మైననాట్యముకంటెఁ బదార్థాభినయాత్మక మైన నృత్యము సర్వథా వేఱని యే గ్రహించునది. ప్రసంగవశంబున నృత్త ముపపాదింపఁ బడుచున్నది.

నృత్తనిర్వచనము:—

### తాలలయాశ్రయము నృత్తము. ౬

లయతాలముల యపేక్ష మాత్రము గలిగి యభినయ శూన్యమైన యవయవవిక్షేపము నృత్త మనఁబడును. ప్రసంగవశంబున నభినయము వివరింపఁ బడుచున్నది.



అభినయభేదనిర్వచనము:—

### (1)అభినయము చతుర్విధము. ౭

సాత్త్వికము, ఆంగికము, వాచికము, ఆహార్యకము నను భేదంబుల నభినయము నాలుగు విధము లగుచున్నది. ఇతరులసుఖదుఃఖాదులను భావించు మనోవ్యాపారమును దెలుపునది సాత్త్వికము. పతాక హస్తాదికముచే స్వగత పరగతాభిప్రాయంబు దెలుపుట యాంగికము. కావ్య నాటకాదులను రసోచిత రాగాదులతో విస్పష్టముగ నుచ్చరించుట వాచికము. నాట్యమునకుఁ దగిన వస్త్రాభరణంబుల నలంకరించుకొనుట యాహార్యకము. ఇట్లభినయంబు నెఱింగి మరల నృత్య నృత్తముల వివరణము తెలియునది.

నృత్యనృత్తవివరణము:—

### నృత్యము మార్గము. ౮

పదార్థాభినయరూప మైననృత్యము మార్గ మని ప్రసిద్ధము.

### నృత్తము దేశి. ౯

అభినయ శూన్యమై యంగ విక్షేపరూప మైన నృత్తము దేశి యని చెప్పఁ బడుచున్నది.

### రూపకోపయోగము ఫలము. ౧౦

ప్రసంగోక్తము లయిన యీనృత్య నృత్తములకు లాస్యతాండవ రూపంబున నాటకాదులయం దుపయోగించుటయే ఫలము. అక్కడక్కడ సందర్భమును బట్టి పదార్థము నభినయించుటచే నృత్యమునకును, శోభను గలిగించుటచే నృత్తమునకును రూపకంబుల నుపయోగము గలుగు నని యెఱుంగునది. ఇంక మున్ను చెప్పిన దశవిధరూపకంబులు గూడ ననుకరణంబులే యగుటచే వాని కభేదము సంభవింపఁ దగియున్నను వస్తువు, నాయకుఁ

(1) మూలమందు లేని యీలక్షణ మిం దధికముగాఁ జేర్పఁబడినది.

ము, రసము నను నివి మూఁడును వానికి భేదము గలిగింపఁ గారణము లగు చున్న వని యెఱుంగునది.

వస్తు నిరూపణము:—

### వస్తువు, ఆధికారికము ప్రాసంగికము నని ద్వివిధము. ౧౧

వాక్యంబునకుఁ బ్రధాన మైన వృత్తాంతము ఆధికారిక మనియు, అంగభూత మైన వృత్తాంతము ప్రాసంగిక మనియుఁ జెప్పఁబడును.

రామాయణంబున సీతారాములయుదంత మాధికారికము. తదంగ మయిన విభీషణ సుగ్రీవాదుల వృత్తాంతము ప్రాసంగికము. మఱియు:—

### అధికారినిర్వృత్త మాధికారికము. ౧౨

కథానాయకుఁడు ఫలస్వామియు నగు నధికారిచే ఫలావసానము దనుక నిర్వహింపఁబడు నితివృత్త మాధికారికము.

### ప్రసంగనిర్వృత్తము ప్రాసంగికము. ౧౩

ప్రధానేతివృత్తమునందుఁ బ్రసంగ వశంబునఁ బ్రవేశించి స్వప్రయోజనము గాంచిన యితివృత్తము ప్రాసంగికము.

### అయ్యది పతాకా ప్రకరీనామంబుల ద్వివిధము. ౧౪

సుగ్రీవాది వృత్తాంతమువలెఁ గథలోఁ జాలవఱకు సంబంధించినది పతాక యనియు, శ్రమణాది వృత్తాంతమువలె నల్పమైనది ప్రకరి యనియుఁ జెప్పఁబడును. మఱియుఁ బతాకాప్రసంగంబునఁ బతాకాస్థానకముగూడ నిర్వచింపఁబడుచున్నది.

### భావ్యర్థసూచకము పతాకాస్థానకము. ౧౫

ప్రకరణ వశంబున రాఁబోవు కథను సూచింపఁ బతాకవలె నుండునది పతాకాస్థానక మని చెప్పఁబడును. ఎట్లనఁగా నుత్తరరామ చరితంబున, (తెరలో)



గీ. ఏడులోకంబులందుఁ దా నేకవీరుఁ, డైనరావణకులహంతకగును జయప
తాకయిదికోకభూమికంతకును వీర, ఘోషణంబగునీయజ్ఞఘోటకంబు.

అను సైనికవచనము రాఁబోవు లవచంద్రకేతువుల యుద్ధంబునకు సూచక మైనది.

### వస్తువు మరలఁ బ్రఖ్యాతాది భేదంబునఁ ద్రివిధంబు. ౧౬

ఇట్లాధికారిక ద్వివిధ ప్రాసంగిక భేదంబున మూఁడువిధము లైన యితివృత్తము ప్రఖ్యాతము, ఉత్పాద్యము, మిశ్రము నను భేదంబుల మరల మూఁడు విధము లగుచున్నది - భారత రామాయణాది ప్రసిద్ధ మగుకథ ప్రఖ్యాత మనియు, స్వకపోల కల్పితకథ యుత్పాద్య మనియు, నీరెంటితోఁ గూడినది మిశ్ర మనియుఁ జెప్పఁబడును. వీనికిఁ గ్రమముగా మహావీర చరిత్ర, మాలతీమాధవీయము, ఉత్తరరామచరితము నుదాహరణములు.

### కార్యము త్రివర్గము. ౧౭

ఇట్టి యితివృత్తమునకు ధర్మార్థకామంబులు ఫలము.

### ఇతివృత్తంబున నర్థప్రకృతు లుపయోజ్యంబులు. ౧౮

ప్రయోజనసిద్ధిహేతువు లగుబీజము బిందువు పతాక ప్రకరి కార్యము నను నైదును ముఖ్యముగా నెఱింగి ప్రధానకథలోఁ బ్రయోగింపఁ దగును. ఇందుఁ బ్రసంగవశంబున నిరూపింపఁబడిన పతాకాదులకుఁ గాక బీజ బిందువుల కిట్లు లక్షణంబు లరయునది.

బీజలక్షణము:—

### బీజము బీజమువంటిది. ౧౯

తొలుతఁ జిన్న దయ్యుఁ గ్రమముగా ననేక ప్రకారంబుల విత్తువలె విస్తరించి కార్యసాధకం బగునట్టి హేతువిశేషము బీజము నాఁబడు.

ఇందులకు రత్నావళిలో - వత్సరాజునకు రత్నావళి లభింప హేతు వగు యౌగంధరాయణ వ్యాపారంబును, వేణీసంహారములో - ద్రౌపది

క్లేశంబులు ముడువఁ గారణం బగు భీమక్రోధప్రవృద్ధ మయిన ధర్మరాజో త్సాహమును నుదాహరణంబులు.

బిందులక్షణము:—

### అవిచ్ఛేదకారణంబు బిందువు. ౨౦

ఒకకథాంశము సమాప్తముగా నుండఁ గథ విడిపోకుండున ట్లనంతర కార్యము సంఘటింపఁ గారణ మగునది బిందువు. ఇందులకు రత్నావళిలో - వాసవదత్త చేయు మదనపూజ సమాప్త మగునవసరమున వైతాళికుఁ డొనరించుస్తోత్రపాఠమును వినిసాగరిక వత్సరాజును బొందఁ గోరుట యుదాహరణము.

ఆరంభాద్యవస్థావివరణము:—

### అవస్థ లర్థప్రకృతితుల్యంబులు. ౨౧

ఆరంభము, ప్రయత్నము, ప్రాప్తిసంభవము, నియతప్రాప్తి, ఫలయోగము ననునైదును నవస్థలు. ఇవి బీజాదులవలె నేయితివృత్తంబునఁ బ్రయోజ్యంబులు.

### ఔత్సుక్యమాత్ర మారంభము. ౨౨

ఇది నేను సంపాదించెద నని పూనుకొనుట యారంభ మనఁబడును. ఇందులకు రత్నావళిలో - వత్సరాజు కార్యమును యౌగంధరాయణుఁడు పూనుకొనుట యుదాహరణము.

### సత్వరవ్యాపారము ప్రయత్నము. ౨౩

ఫలము సంభవింపని యప్పుడు చేయుతీవ్ర మగు నుపాయయోజనాదికము ప్రయత్న మనఁబడు.

ఇందులకు—వత్సరాజసమాగమంబునకు సాగరిక చేయుచిత్రలేఖనాదికం బగునుపాయ ముదాహరణము.



### అనిశ్చితఫలప్రాప్తి ప్రాప్తిసంభవము. ౨౪

ఉపాయంబున కపాయశంకచే నిశ్చయింపఁబడని ఫలలాభము ప్రాప్తిసంభవ మనఁబడును.

ఇందులకు— వత్సరాజసమాగమంబునకు సాగరిక చేయు వేషపరివర్తనరూపం బగునుపాయము వాసవదత్తాకోపరూపం బగునపాయశంకచే ననిశ్చితం బగుట యుదాహరణము.

### నిశ్చితలాభము నియతప్రాప్తి. ౨౫

అపాయాభావముచే నిశ్చయింపఁబడిన ఫలలాభము నియతప్రాప్తి యనఁబడును.

ఇందులకు—బతిమాలి వాసవదత్తకోపమును శాంతింపఁ జేయుటచే సాగరికజీవనలాభము నిశ్చయింపఁబడుట యుదాహరణము.

### సమగ్రఫలసంపత్తి ఫలయోగము. ౨౬

రత్నావళీలాభకారణంబున నుదయనునకుఁ జక్రవర్తిత్వలాభము ఫలయోగము.

సంధిపదార్థము:—

### అర్థప్రకృత్యవస్థాసంయోగము సంధి. ౨౭

బీజాదు లగునర్థప్రకృతు లైదును క్రమముగా నారంభాదు లగునైదవస్థలతోఁ గలియుటయే యిందు సంధి యనంబడును. ఇఁక సామాన్యలక్షణ మి ట్లరయునది.

### అవాంతరైకార్థసంబంధము సంధి. ౨౮

ఒకప్రయోజనంబుతోఁ గూడినకథాంశంబులకు వేఱొకప్రయోజనంబుతోడిసంబంధము సంధి నాఁబడు.

ముఖాదిసంధిపంచకలక్షణము:—

## ఇది పంచవిధంబు. ౨౯

ముఖము, ప్రతిముఖము, గర్భము, అవమర్శము, ఉపసంహృతి యను నామంబుల సంధు లైదు విధము లగుచున్నది.

## బీజారంభసమన్వయము ముఖసంధి. ౩౦

అర్థప్రకృతి యగుబీజంబును, అవస్థ యగు నారంభంబును గలియుట యే ముఖసంధి. ఇది బహువిధప్రయోజనం బగురసంబునకు హేతు వగును. దీనింబట్టి త్రివర్గఫల మీయఁ జాలనిప్రహసనాదులయందు రసోత్పత్తిహేతు వునకే బీజత్వము చెప్పఁదగును.

ముఖసంధి కుదాహరణము:—

"ఎచ్చట నుండి యైనను దీసికొని వచ్చి దైవమే యభిమతవస్తువును సంఘటింపఁ జేయును." అని యౌగంధరాయణుండు వత్సరాజునకు రత్నావళి లభింప హేతు వగునను కూలదైవమును సూచించుట యను బీజంబును, తత్కార్యసిద్ధి కతండే పూనుకొనుట యను నారంభంబును గలియుటచే ముఖసంధి యేర్పడుచున్నది.

## బిందుప్రయత్నసమాగమము ప్రతిముఖసంధి. ౩౧

వత్సరాజసమాగమంబునకై సాగరిక చేయుచిత్రలేఖనం బనుబిందువును సమయానుగుణంబు చేష్టారూపంబు నగుప్రయత్నమును గలియుట యే ప్రతిముఖసంధి.

## దృష్టనష్టబీజాన్వేషణము గర్భసంధి. ౩౨

ఇందుఁ బతాక యను నర్థప్రకృతికి నియమము లేదు. ప్రాప్తిసంభవావస్థ యుండఁదగును. బీజంబునకు మొదల నంతరాయము పిదప లాభము మరల నపాయము తిరిగి యుపాయము ననుకారణంబులచే నిశ్చయింపఁబడని ఫలప్రాప్తి కలది యై గర్భసంధి యేర్పడుచున్నది. ఎట్లనఁగా?— మొదల



వత్సరాజునకు సాగరిక లభించు ననెడియాశ, దానికి వాసవదత్తచే విఘ్నము, మరలఁ బ్రాప్తి, తిరిగి విచ్ఛేదము, తుదకు సాగరికాలాభంబునకు దేవీప్రసాదనంబె యుపాయము గా నిశ్చయింపఁబడుట యనునది ప్రాప్తిసంభవరూపం బైనగర్భసంధిగా నగుచున్నది.

## నియతప్రాప్తిపర్యాలోచన మవమర్శసంధి. ౩౩

ఇందుఁ బ్రకరికి నియమము లేదు. అపాయంబు లేని ఫలలాభమును నిశ్చయించు నాలోచనం బే యవమర్శసంధి యనఁబడును. దీనికిఁ గ్రోధము గాని, వ్యసనము గాని, విలోభనము గాని, కారణము గావచ్చును. ఎట్లనఁగా? వేణీసంహారములో "భీష్మాది మహారథికులు కర్ణాది మహావీరులు నెల్లరు నశించినను భీముఁడు కొంచెము మిగిల్చియుండుటచే మన మందఱము వాఙ్మాత్రమున జీవితసంశయము నందుచున్నారము" అనుచోట భీష్మాదివధంబునఁ జాలవఱకు నిశ్చయింపఁబడిన పాండవవిజయ మింక భీముఁడు దుర్యోధనుని జంపి ప్రతిన నెఱవేర్చుటతో నున్నద నెడి యాలోచన మే యవమర్శసంధి.

## కార్యఫలయోగసంగమ ముపసంహృతసంధి. ౩౪

కార్యప్రకృతి ఫలయోగావస్థతోఁ గూడుట యుపసంహృతి. ఇది యే నిర్వహణసంధి యని కూడఁ జెప్పఁబడును. ముఖాదిసంధులకుఁ బ్రయోజనైక్యము గల్పించి యేది ఫలము నిర్వహించునో యది నిర్వహణ మనఁబడును. ఎట్లనఁగా? వేణీసంహారములో—"మహారాజా! వృద్ధి నొందుచుంటివి. భీమసేనుఁడు దుర్యోధనునినెత్తురు శరీర మెల్లెడఁ బూసికొని వచ్చుచుండెను" అని కంచుకి చెప్పుటచే ద్రౌపదీకేశసంయమనము మొదలగుముఖసంధ్యాదుల కొక్కచోఁ బ్రయోజనము నిర్వహింపఁబడినది. పూర్వోక్తవిధము గా సంధుల నెఱింగి యిఁక వాని యంగములను గ్రమము గా నెఱుంగునది.

ముఖసంధ్యంగములు:—

### ఉపక్షేపాదు లేతదంగములు. ౩౫

ఉపక్షేపము పరికరము పరిన్యాసము విలోభనము యుక్తి ప్రాప్తి సమాధానము విధానము పరిభావన ఉద్భేదము భేదము కరణము అను నీపండ్రెండును ముఖసంధి కంగములు. రచనావశంబున నైజముగా సంభవించు వీనికిఁ బ్రమాణప్రవృత్తికై లక్షణంబులు మాత్రము నిర్వచింపఁబడుచున్నవి. ఇట్లే ప్రతిముఖసంధ్యాదులయంగంబులకుఁ గూడ నెఱుంగునది. అంగ మనఁగా ముఖ్య మయినసంధి కుపకరించునట్టి యవయవ మని యర్థము.

### బీజన్యాస ముపక్షేపము. ౩౬

తొలుతఁ జిన్న దయ్యుఁ బిదప ననేకప్రకారంబుల విత్తువలె విస్తరించి కార్యసాధకం బగునట్టిహేతు విశేషము బీజ మని మున్ను నిర్వచింపఁబడినది. దాని నిలుపుట యే యుపక్షేపము.

### తద్బాహుళ్యము పరికరము. ౩౭

ఆబీజము వృద్ధి పొందుటకుఁ దగిన సంభాషణాదికము పరికరము.

### తన్నిష్పత్తి పరిన్యాసము. ౩౮

బీజసాధనమునకు హేతు వైనమాటలను చెప్పుట పరిన్యాసము.

### తద్గుణాఖ్యానము విలోభనము. ౩౯

ఆసక్తి పుట్టించునట్లు బీజము యొక్క గుణములను వర్ణించుట విలోభనము.

### తదర్థసంప్రధారణము యుక్తి. ౪౦

బీజముయొక్క ప్రయోజనము సిద్ధించుటకుఁ దగిన ట్లాలోచించుట యుక్తి.

### బీజసుఖాగమము ప్రాప్తి. ౪౧

బీజభూత మైనది సుఖము గా సంభవించుట ప్రాప్తి.



### బీజసమాగమము సమాధానము. ౪౨

బీజభూతవిషయమును (నాయికా నాయకాదులను) సమీపించుట సమాధానము.

### బీజసుఖదుఃఖకారి విధానము. ౪౩

బీజభూత మయిన దానికి సుఖదుఃఖములను గలుగఁ జేయువిషయము విధానము.

### అద్భుతావేశము పరిభావన. ౪౪

బీజభూత మయినదానికి లోకోత్తర మయిన ప్రసక్తివలనఁ గలిగిన యద్భుత రసావేశము పరిభావన యనఁబడును.

### గూఢభేదన ముద్భేదము. ౪౫

బీజభూత మయినయనురాగ క్రోధాదికమును బ్రకటింపఁ జేయుట యుద్భేదము.

### ప్రోత్సాహన భేదము. ౪౬

బీజభూతవిషయంబున కనుగుణంబు గఁ బ్రేరేపించుట భేదము.

### ప్రకృతారంభము కరణము. ౪౭

బీజవిషయము సఫల మగుటకుఁ జేయఁ దగినపని నారంభించుట కరణము. ఇందు, ఉపక్షేపపరికర పరిన్యాస యుక్త్యుద్భేద సమాధానములు ముఖ్యములు. ఇతరములు యథాసంభవముగాఁ బ్రయోగింపఁ దగును.

ప్రతిముఖసంధ్యంగములు:—

### విలాసాదు లేతదంగములు. ౪౮

విలాసము పరిసర్పము విధూతము శమము నర్మము నర్మద్యుతి ప్రగమనము విరోధము పర్యుపాసనము వజ్రము పుష్పము ఉపన్యాసము వర్ణసంహారము అను నీపదుమూఁడును బ్రతిముఖసంధి కంగములు.

### రతివిషయేచ్ఛ విలాసము. ౪౯

నాయకునియొక్కగాని, నాయికయొక్కగాని సమాగమరూపం బగురతియందలి మనోరథము విలాస మనఁబడును.

### దృష్టనష్టానుసర్పణము పరిసర్పము. ౫౦

కనఁబడి కనఁబడక, లేక తెలియఁబడి తెలియఁబడక, యుండునట్టి బీజభూతమైన వస్తువును సాధింప ననుసరించుట పరిసర్పము.

### అరతి విధూతము. ౫౧

అభీష్టవస్తువు లభింపక పోవుటచేఁ గాని యనిష్టమును శంకించుకొను టచేఁ గాని యనురాగము చెడుట విధూత మనఁబడు.

### తచ్ఛాంతి శమము. ౫౨

దైవవశంబునఁ గాని యుపాయాంతరంబునం గాని కోరిక నెఱవేఱ నవకాశము గలిగి యాయరతి శాంతించుట శమ మనఁబడు.

### పరిహాసవచనము నర్మము. ౫౩

నవ్వులాటమాట నర్మ మనఁబడు.

### ధృతి నర్మద్యుతి. ౫౪

పరిహాసవచనములచేఁ బ్రకటింపఁబడిన యనురాగమువలనఁ గలిగిన ధైర్యము నర్మద్యుతి యనంబడు.

### ఉత్తరోత్తరవచనము ప్రగమనము. ౫౫

నాయకానురాగమునుగూర్చి నాయికయు, నాయికానురాగమును గూర్చి నాయకుఁడును, క్రమముగా దూతికావిదూషకులతో నొనర్చునుత్తరోత్తర సంభాషణము ప్రగమన మనఁబడు.

### హితనిరోధనము విరోధము. ౫౬

అభీష్ట మయినపని కభ్యంతరము గలిగించుట విరోధము.



### అనునయము పర్యుపాసనము. ౫౭

ప్రియజనమును బతిమాలుకొనుట పర్యుపాసనము.

### ప్రత్యక్షనిష్ఠురవచనము వజ్రము. ౫౮

ప్రియజనంబున కెదురుగాఁ గఠినమైన మాటలు పలుకుట వజ్రము.

### సవిశేషవచనము పుష్పము. ౫౯

నాయికానాయకుల విశేషానురాగమును దెలుపువచనము పుష్పము.

### సోపాయవచన ముపన్యాసము. ౬౦

అనురాగమును బోషించునట్లు చక్కగా మాటలాడుట యుపన్యాసము.

### చాతుర్వర్ణ్యోపగమనము వర్ణసంహారము. ౬౧

బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్ర వర్ణములు నాలుగును యథాసంభవముగా వర్ణించుట వర్ణసంహారము. ఇందుఁ బరిసర్ప శమ వజ్రోపన్యాస పుష్పములు ప్రధానములు. ఇతరము లైచ్ఛికములు.

గర్భసంధ్యంగములు :—

### అభూతాహరణాదు లేతదంగములు. ౬౨

అభూతాహరణము మార్గము రూపము ఉదాహరణము క్రమము సంగ్రహము అనుమానము తోటకము అధిబలము ఉద్వేగము సంభ్రమము ఆక్షేపము అను నీ పండ్రెండును గర్భసంధి కంగములు.

### ఛద్మ మభూతాహరణము. ౬౩

ప్రకృతకార్యమున కనుకూలముగా నొనరించుమోసపుఁబని యభూతాహరణ మని చెప్పఁబడును.

### తత్త్వార్థకీర్తనము మార్గము. ౬౪

నిజమైనవిషయము తెల్పుట మార్గము.

### సవితర్కవాక్యము రూపము. ౬౫

తనవృత్తాంత మితరులకుఁ దెలిసిన దేమో యనెడిసంశయమును, లేక యూహను దెల్పునట్టిమాట రూప మనఁబడును.

### సోత్కర్షవచన ముదాహరణము. ౬౬

ఒకవిషయముఁగూర్చి యతిశయము గాఁ జెప్పుట యుదాహరణము.

### సంచింత్యమానప్రాప్తి క్రమము. ౬౭

ఆలోచించుచున్నకోరిక నెఱవేఱుట క్రమము.

### సామదానోక్తి సంగ్రహము. ౬౮

స్వకార్యసిద్ధికై యితరులను వశపఱచుకొనునట్టి సామదానోపాయములతోడి వచనము సంగ్రహము.

### లింగాభ్యూహన మనుమానము. ౬౯

ఏదో యొక కారణమునుబట్టి కార్య మూహించుట యనుమానము.

### సంరబ్ధవచనము తోటకము. ౭౦

గొప్పకోపముతోఁ గూడినమాట తోటకము.

### అభిసంధి యధిబలము. ౭౧

పరవంచనచే నైనకార్యసంధాన మధిబలము.

### శత్రుకృతభీతి యుద్వేగము. ౭౨

రిపుజనమువలనఁ గలుగుభయ ముద్వేగము.

### శంకాత్రాసములు సంభ్రమము. ౭౩

సంశయము భయము నను నీరెండును సంభ్రమ మనిచెప్పఁబడును.

### గర్భబీజసముద్భేద మాక్షేపము. ౭౪

కార్యసాధనంబున కాధారమై బీజభూత మయినవిషయమును బ్రకటించుట యాక్షేప మనఁబడును. ఇందు, అభూతాహరణ మార్గతోట కాధి



బలాక్షేపములు ప్రధానములు. అన్యములు యథాసంభవముగ నుపయోగింపఁదగును.

అవమర్శసంధ్యంగములు:—

### అపవాదాదు లేతదంగములు. ౭౫

అపవాదము సంఫేటము విద్రవము ద్రవము శక్తి ద్యుతి ప్రసంగము ఛలనము వ్యవసాయము విరోధనము ప్రరోచనము విచలనము ఆదానము అను నీపదుమూఁడును అవమర్శసంధి కంగములు.

### దోషప్రఖ్యాపన మపవాదము. ౭౬

ఇతరులదోషములను బ్రకటించి చెప్పుట యపవాదము.

### రోషభాషణము సంఫేటము. ౭౭

రోషముతోఁ గూడినసంభాషణము సంఫేటము.

### వధబంధాదికము విద్రవము. ౭౮

చంపుట బంధించుట అగ్నిప్రవేశము మొదలైనవి విద్రవమనఁబడును.

### గురుతిరస్కృతి ద్రవము. ౭౯

పూజ్యులగుపెద్దలను దిరస్కరించుట ద్రవము.

### విరోధశమనము శక్తి. ౮౦

విరోధము శాంతించుటను గూర్చి చెప్పుట శక్తి.

### తర్జనోద్వేజనములు ద్యుతి. ౮౧

అదలించుట బెదరించుట ద్యుతి యనఁబడు.

### గురుకీర్తనము ప్రసంగము. ౮౨

పూజ్యులగువారిని బొగడుట ప్రసంగము.

### అవమాననము ఛలనము. ౮౩

అవమానించుట ఛలన మనఁబడును.

### స్వశక్తివచనము వ్యవసాయము. ౮౪

తనసామర్థ్యమును జెప్పుట వ్యవసాయము.

### సంరబ్ధవచనము విరోధనము. ౮౫

కోపావేశము గలవారిప్రసంగము విరోధనము.

### భావిశ్రేయఃకథనము ప్రరోచనము. ౮౬

రాఁబోవు శ్రేయస్సును గూర్చి ముందుగాఁ బ్రశంసించుట ప్రరోచనము.

### వికత్థన విచలనము. ౮౭

తనగుణముల నావిష్కరించుట విచలనము.

### కార్యసంగ్రహ మాదానము. ౮౮

ఉద్దిష్ట కార్యమును లెస్సగా గ్రహించి చెప్పుట యాదాన మనఁబడు. ఇందు, అపవాద శక్తి వ్యవసాయ ప్రరోచనాదానములు ముఖ్యములు. ఇతరము లిచ్ఛాధీనములు.

నిర్వహణసంధ్యంగములు:—

### సంధ్యాదు లేతదంగములు. ౮౯

సంధి విబోధము గ్రథనము నిర్ణయము పరిభాషణము ప్రసాదము ఆనందము సమయము కృతి భాషణము ఉపగూహనము పూర్వభావము కావ్యసంహారము ప్రశస్తి అను నీపదునాలుగును నిర్వహణసంధి కంగములు.

### బీజోపగమనము సంధి. ౯౦

ముఖసంధియందుఁ జెప్పఁబడినబీజభూత మయినదానిని మరల ఫలప్రాప్తి కనుగుణంబుగాఁ జెప్పుట సంధి యనఁబడును.

### కార్యమార్గణము విబోధము. ౯౧

ప్రధానకార్యమును వెదకుట విబోధము.



### కార్యోపక్షేపము గ్రథనము. ౯౨

ప్రధానకార్యమును సిద్ధపఱుచుట గ్రథనము.

### అభూతాఖ్యానము నిర్ణయము. ౯౩

అనుభవించినవిషయమును దెలియఁ జేయుట నిర్ణయము.

### మిథోజల్పము భాషణము. ౯౪

ఒకవిషయమునుగూర్చి యిరువురుపరస్పరముమాటలాడుట భాషణము.

### పర్యుపాసనము ప్రసాదము. ౯౫

కార్యసిద్ధిని దెలిపి సంతోషపెట్టుట ప్రసాదము.

### వాంఛితావాప్తి యానందము. ౯౬

కోరినది సంభవించుట యానందము.

### దుఃఖనిర్గమము సమయము. ౯౭

విచార మెడఁబాయుట సమయము.

### లబ్ధస్థిరీకరణము కృతి. ౯౮

ప్రాప్త మయినదానిని స్థిరముగాఁ జేసికొనుట కృతి.

### మానాదిలాభము భాషణము. ౯౯

కార్యము నెఱవేఱుటచేఁ గలిగినమానము సంతోషము ఉత్సాహము మొదలగువానిలాభమే భాషణ మనఁబడును. ఇది సామాన్యముగా రూపకాంత మందుఁగాఁ దగినది.

### అద్భుతార్థప్రాప్తి యుపగూహనము. ౧౦౦

ఆశ్చర్యకర మయినప్రయోజనమును బొందుట యుపగూహనము.

### కార్యదర్శనము పూర్వభావము. ౧౦౧

ప్రస్తుతకార్యమును మంచియభిప్రాయముతోఁ జూచుట పూర్వభావము.

వరాప్తి కావ్యసంహారము. ౧౦౨

"నీ కిం కేమి ప్రియ మొనరింప వలయును" అనుటచేఁ గావ్యార్థము ను ముగించుట కావ్యసంహారము.

శుభశంసనము ప్రశస్తి. ౧౦౩

కావ్యాంతమున శుభప్రశంస చేయుట యే ప్రశస్తి యనఁబడును. ఇది యే భరతవాక్యము గా రూపకాంతంబులఁ జూడఁ బడుచున్నది. ఇట్లఱువది నాలు గంగములతో నైదు సంధులు ను బ్రతిపాదింపఁ బడినవి. ఈచెప్పఁ బడినసంధ్యంగములకు ఫల మి ట్లరయునది.

సంధ్యంగప్రయోజనములు:—

ఇష్టార్థరచనాదులు షట్ప్రయోజనంబులు. ౧౦౪

చెప్పఁ దలఁచినదానిని జెప్పుట ప్రకటింపఁ దగినదానిని బ్రకటించుట దాఁచఁ దగినదానిని దాఁచుట సంతోషానురాగములను గలిగించుట కథాచమత్కారమును గలిగించుట ఇతివృత్తమును విస్తరింపఁజేయుట యను నీయాఱును బైని నిరూపింపఁ బడినయఱువదినాలు గంగములకుఁ బ్రయోజనంబులు. ఇట్లు సాంగముగా సప్రయోజనముగా సంధిపంచకము నిరూపింపఁ బడిన పిదప మరల వస్తువిభాగము తెలుపఁ బడుచున్నది.

పునర్వస్తువిభాగము:—

సూచ్య దృశ్యశ్రవ్య భేదంబున వస్తువు ద్వివిధంబు. ౧౦౫

సంగ్రహంబు గ సూచింపఁబడునీరసం బైనవస్తువిస్తారము సూచ్యమనియు, మధురోదాత్తరసభావసమన్వితం బై ప్రదర్శింపఁబడు వస్తువు (దృశ్యశ్రవ్యము) దృశ్య మని యు మరల నిదిరెండు విధము లగుచున్నది.



విష్కంభాదిపంచకనిర్వచనము:—

విష్కంభాదిసూచనీయము సూచ్యము. ౧౦౬

విష్కంభము ప్రవేశకము చూళిక అంకాస్యము అంకావతారము నను నైదును విష్కంభాదులు.

సంక్షేపార్థము విష్కంభము. ౧౦౭

గడచినదియు రాఁబోవునది యు నగుకథాంశంబులను దెల్పునది యై మధ్యమపాత్రప్రయుక్తం బై యర్థసంగ్రహం బగునది విష్కంభము.

ఇది శుద్ధసంకీర్ణనామంబుల ద్వివిధంబు. ౧౦౮

ఒకనిచేఁ గాని యిద్దఱచేఁ గాని మధ్యమపాత్రములచే నాచరింపఁ బడునది శుద్ధ మనియు, మధ్యమాధమపాత్రములచే నొక్కమాఱు గాఁ దెలుపఁ బడునది సంకీర్ణ మనియుఁ జెప్పఁబడును.

నీచపాత్రప్రయుక్తము ప్రవేశకము. ౧౦౯

విష్కంభమువలె నే యాగతానాగత కథాంశంబులను జ్ఞాపకం బై యొకనిచేఁ గాని యిద్దఱచేఁగాని నీచపాత్రములచేఁ బ్రయోగింపఁ బడునది ప్రవేశక మనఁబడును. ఇది ప్రథమాంకమున నుండఁ దగదు.

నేపథ్యపాత్రసూచితము చూళిక. ౧౧౦

తెరలో నున్నపాత్రముచే సూచింపఁబడినయర్థము చూళిక యనఁబడును. ఎట్లనఁగా ఉత్తరరామచరితములో "తపోధనకు స్వాగతము" అని తెరలోని వాసంతికచే నాత్రేయిరాక సూచింపఁబడుట చూళిక.

అంకాంతపాత్రకృతం బగు నుత్తరాంకసూచన మంకాస్యము. ౧౧౧

ఏదైన నొకయంకంబుతుద నొకపాత్రము ప్రవేశించి యాయంకములోనికథ సమాప్తముగా నుండఁ గాఁ దరువాతియంకముయొక్క కథాము

ఖంబును సూచించుట యంకాస్య మనఁబడును. వీరచరితలో ద్వితీయాంకం బుతుద సుమంత్రుఁడు ప్రవేశించి జనకశతానందుల కథాంశము సమాప్తమగు చుండఁగాఁ దృతీయాంకముఖం బగు వసిష్ఠ విశ్వామిత్రాదుల ప్రవేశమును సూచించెను.

## పూర్వాంకావిచ్ఛినోత్తరాంకార్థసూచన మంకావతారము. ౧౧౨

ప్రవేశకవిష్కంభాదులతోఁ బని లేక యే యొకయంకంబుతుదఁ బ్రవేశించినయొకపాత్రముచేఁ బూర్వాంకకథతో విడిపోకుండఁగా నుత్తరాంక కథ సూచింపఁబడుట యంకావతార మనఁబడును. ఎట్లనఁగా మాలవికాగ్నిమిత్రములో "మీ రిరువురును దేవిగారిప్రేక్షాగృహంబున కేగి సంగీతరచన చేసి రాజునొద్దకు దూత నంపుఁడు. కాదేని మద్దెలచప్పుడే రాజును లేవఁ దీసికొని రాఁగలదు" అని విదూషకుఁడు చెప్పినంత నే యాచార్యులు వెళ్లి యట్లు చేయఁగాఁ దెరలోనిమృదంగధ్వని విని యందలి యెల్లపాత్రలును బ్రథమాంకంబునఁ బ్రశంసింపఁబడిన యభినయపరీక్షను ద్వితీయాంకంబు మొదల నారంభించిరి. ఇది యే మొదటి యంకముతో విడి పోకుండ రెండవయంక మవతరించుట.

## సూచ్యభిన్నము దృశ్యము. ౧౧౩

పూర్వోక్తవిధముగా విష్కంభాదులచే సూచింపఁ దగినది సూచ్యము. మిగిలినది యనఁగా నంకములచేఁ బ్రదర్శింపఁ దగినది దృశ్యము. అని యెఱింగి మరల వస్తువిభేద మిట్లరయునది.

పునర్వస్తువిభేదము:—

## నాట్యధర్మాపేక్షితం బగువస్తువు త్రివిధము. ౧౧౪

నాట్యధర్మముల నపేక్షించిన యీవస్తువు శ్రావ్యము అశ్రావ్యము నియతశ్రావ్యము ననుభేదంబుల మరలఁ ద్రివిధ మగుచున్నది.



## శ్రావ్యము ప్రకాశము. ౧౧౫

ఎల్లరు వినఁదగిన యిది ప్రకాశ మనఁబడును.

## అశ్రావ్యము స్వగతము. ౧౧౬

ఎవ్వరును వినఁ దగనియిది స్వగతమనఁబడును.

## నియతశ్రావ్యము ద్వివిధము. ౧౧౭

జనాంతికము అపవారితము ననుభేదంబుల నిది రెండు విధము లగుచున్నది.

## త్రిపతాకాకరాంతరితంబగు సంభాషణము జనాంతికమునాఁబడు. ౧౧౮

బొట్టనవ్రేలు వంచి చూపుడువ్రేలి మొదటఁ గూర్చి యుంగరపువ్రేలు వంచి కడమవ్రేళ్లను జాఁచి పట్టిన యభినయహస్తవిశేషము త్రిపతాకాకర మనఁబడును. దీనిచే నొకని మఱుగుపఱిచి యితరునితో మాట లాడుట జనాంతిక మనఁబడును. అనఁగా నెవఁడు వినఁ దగఁడో వానివైపు త్రిపతాకం బగుచేయి పెట్టి మఱియొకనితో మాట లాడుట యని భావము.

## పరావృత్తిచే రహస్యకథన మపవారితము. ౧౧౯

అన్యుల కడ్డముగాఁ దిరిగి యొక్కనితో రహస్య మాలోచించుట యపవారితము.

## పాత్రానుక్తకథన మాకాశభాషితము. ౧౨౦

"ఏ మంటివి, జను లిట్లు చెప్పుచున్నారు" అనునట్లుగా నాకాశమువంకఁ జెవిపెట్టి యెవ్వరును జెప్పనిదానిని వినిన ట్లభినయించి చెప్పుట యాకాశభాషితము.

ఇది ఆంధ్రదశరూపకంబను దృశ్యకావ్యశాసనంబున
వస్తుప్రకాశ మను ప్రథమప్రకరణము.

శ్రీ ర స్తు.

# ఆంధ్రదశరూపకము.

## ద్వితీయప్రకరణము.

### నాయకప్రకాశము.

రూపకముల పరస్పరభేద సిద్ధికి వస్తుభేదము సూచింపఁబడి యిప్పుడు నాయకభేదము ప్రతిపాదింపఁబడుచున్నది.

చ. చదివినవాఁడు సత్కులుఁడు చక్కనిమాటలవాఁడు దాత చ
క్కఁదనమువాఁడు జవ్వనము కర్జము నేరుపు గల్గువాఁడు స
త్యదమశమంబులు న్దయప్రతాపము గల్గినవాఁడు ధైర్యసం
పదవినయంబు గల్గుగుణవంతుఁడు రూపకనాయకుండగున్.

వినయంబునకు మదీయ వీరచరితంబున :—

గీ. ఓమహాత్మ తపోజ్ఞానయోగబల ఘ
నుండవును బ్రహ్మవాదివంద్యుఁడవు నీవు
తెలియ కపచార మొనరించితిని మునీంద్ర!
యంజలి యొనర్తుఁ గరుణింపు మయ్య నన్ను.

చక్కఁదనమున కందే:—

గీ. రామ రఘురామ! నయనాభిరామ మగుచుఁ
దలఁపునకు సరిపడు చక్కఁదనము గల్గ



వర్ణనకు మించుసద్గుణవర్గ మొప్ప
నెల్లవిధముల నామది కెక్కి తీవు.

దానంబునకుఁ జాటువు:—

గీ. చర్మమిడెఁ గర్ణుఁ డొసఁగె మాంసంబు శిబియుఁ
బ్రాణము నొసంగె జీమూతవాహనుండు
అస్థు లొసఁగె దధీచిమహర్షి లోక
హితులగు మహాత్ము లీరాని దేది గలదు?

ఇట్టి యుత్తమనాయకులసుగుణంబులకు మహావీరచరిత శాకుంతలాదులలోని వర్ణనంబులు లక్ష్యము లై విద్వల్లోక విదితంబు లగుచున్నవి. గావున నిం దెల్లనాయక గుణంబులకు నుదాహరణము లీయఁబడలేదు.

నాయకుఁడు ధీరలలిత ధీరశాంత ధీరోదాత్త ధీరోద్ధత
నామంబులఁ జతుర్భేదంబులం గలిగి యుండు. 2

స్పష్టము. క్రమంబుగ లక్షణంబు లరయునది.

ధీరలలితుఁడు:—

గీ. పాలనాదికమును భద్రపఱిచి నిర్వి
చారుఁడై గానముఖకలాసక్తి నుండు
వాఁడు సుకుమారుఁడును సుఖవంతుఁడు నగు
నాయకుఁడు ధీరలలితుఁ డనంగఁ దగును. 3

మంత్రులయందు రాజ్యభార ముంచి భోగాసక్తుఁడై శృంగారప్రధానుం డగునీతఁడు సుకుమార హృదయుఁ డగుటచే లలితుఁ డనఁబరఁగును.

ఇందులకు రత్నావళిలో:—

చ. వినుము వసంత! శత్రువులపీఁచ మణంచితి మంచిమంత్రియం
దునిచితి రాజ్యభారము, సుఖోన్నతిఁ జెందుఁ బ్రజాళి, వచ్చెఁ జ
క్కనిమధుమాస, మీవు చెలికాఁడవు, వాసవదత్త భార్య, నా
కొనరె సమస్త మీమదనునుత్సవ మేను దలంతు నాది గా.

ధీరశాంతుఁడు:—

గీ. సర్వసామాన్య నయదయా సత్యశౌచ
ముఖ్యగుణములు గలచారుమూర్తి విప్ర
వైశ్యసచివాన్యతముఁ డగువాఁడు ధీర
శాంతుఁ డనునాయకుం డగు శాంతుఁ డగుట. ౮

వినయాదినాయకసామాన్యగుణయుక్తు లగువిప్రాదులు ధీరశాంతులు. ఆదిపదంబున వైశ్యసచివులు మాత్రమే గ్రహింపఁ దగుదురు. వైదుష్యాదిగుణభూషితు లగువీరికి నిర్విచారత్వగుణసంపద గలిగినను శాంతతయే నైజధర్మ మగును గాని లాలిత్యము గాదు. మాలతీమాధవ మృచ్ఛకటికాదులయందు మాధవచారుదత్తాదు లుండుటంబట్టి ధీరశాంతులు ప్రకరణములయందే యుపయోగింపఁబడుదు రని వివక్షింపఁబడుచున్నది.

ఇందుల కుదాహరణము:—

గీ. స్ఫురితగుణగణకాంతిచే సుందరుండు
కన్నులకుఁ బండు వొనరింపఁ గారణుండు
బహుకలావంతుఁ డైనయీబాలచంద్రుఁ
డుదయగిరినుండి పుట్టిన ట్లుదయ మొందె.

ధీరోదాత్తుఁడు:—

క. ధీరుఁడు గంభీరుండును
దారుఁడు వినయాతిగూఢదర్పుఁడు శాంతుం
డారబ్ధకార్యదక్షుఁడు
ధీరోదాత్తుండు నాఁ గృతిన్ విలసిల్లున్. ౯

ఆత్మస్తుతి స్తోత్రప్రియత్వాది దుర్గుణంబులకు లోను గాక శోకక్రోధంబుల కంతరంగంబునఁ జోటీక లక్షణోక్తగుణంబుల విలసిల్లువాఁడు ధీరోదాత్తుండు నాఁ బరఁగు. ఇందులకు నాగానందంబున జీమూతవాహనుఁడు



గీ. రక్త మిదె కాఱుచుండె శిరాముఖముల
మిగిలి యున్నది కండ నామేన నింకఁ
గనుపడదు నీకు సంతృప్తి గలిగినట్లు
లోవిహగరాజ! తిన కూర కుంటి వేమి?

మఱియు శ్రీరామునింగూర్చి:—

గీ. పట్టమును గట్టఁ బిలువంగఁ బడినయట్టి
యడవులఁ జరింప విడువంగఁ బడినయట్టి
యారఘుకులోత్తమునకు నాకారమందు
నించుకయు నేవికారంబుఁ గాంచ నైతి.

సర్వసామాన్యంబు లగుస్థైర్యాదిగుణంబులను గొందఱియెడల విశేషముగా వర్ణించుట వారియం దాగుణంబు లధికముగా నున్న వని తెల్పుటకే యని యెఱుంగునది. "సరియే, ఉదాత్తత్వ మనఁగా సర్వోత్కర్షముగా నుండుట. అనఁగా విజిగీషుత్వ మని తేలుచున్నదిగదా? అట్లయినయెడల రాజ్యముకంటెఁ బితృశుశ్రూషయే మంచి దని రాజ్యము విడిచి తండ్రిని సేవింప నడవి కేగినట్లు వర్ణింపఁబడిన శమదమప్రధానుఁడు నిర్జిగీషువు నగుజీమూతవాహనుఁడు ధీరోదాత్తుఁ డెట్లు కాఁగలడు? రాజ్యసుఖనిరభిలాషుఁ డగునట్టినాయకుని గ్రహించి నడుమ మలయవత్యనురాగము వర్ణించుట యెట్లు తగును? నాయకసామాన్యగుణయుక్తు లగుద్విజాదులు ధీరశాంతు లగుదురను లక్షణమైనను బారిభాషిక మగుటచేఁ గేవలశాంతతాపరము గాక యాతనియెడల సమన్వయింపదు. కావున వస్తుస్థితిచే బుద్ధ యుధిష్ఠిర జీమూతవాహనాదుల వ్యవహారములు కేవలశాంతతఁ దెల్పుచున్నవి గాని ధీరోదాత్తత్వము ను జూపకున్నవి" అని వచ్చునాక్షేపమున కిట్లు సమాధాన మరయఁదగును. ఉదాత్తలక్షణము జీమూతవాహనాదులయెడ సమన్వయింపక పోదు. ఏమనఁగా?—ఉదాత్తత్వమున కర్థ మగు విజిగీషుత్వ మొక్కవిధముగా నే

యుండునది గాదు. శౌర్యముచేఁ గాని దానాదులచేఁ గాని దయాదిసుగుణంబులచేఁ గాని యెవ్వఁ డెల్లర నతిశయించునో యతఁడే విజిగీషు వగును గాని పరుల కపకారము చేసి స్వలాభము పడయువాఁడు కాఁడు. అట్లేని త్రోవలు కొట్టువాఁడు గూడ ధీరోదాత్తుఁడు కావలసివచ్చును. దుష్టశిక్షణశిష్టరక్షణరూపం బగు జగత్పరిపాలనంబునఁ బ్రవర్తించురామాదులకు నిమిత్తమాత్రము లగురాజ్యాదిలాభములు ప్రధానము లగునా? కావునఁ బ్రాణము లొసంగి యైనను బరుల కుపకార మొనరించుటయే ముఖ్యముగాఁ జూచుదయాళు రగుజీమూతవాహనాదులు విశ్వాతిశాయి సౌజన్యంబున ధీరోదాత్తతములు గాఁగలరు. జీమూతవాహనుఁడు విషయసుఖ విముఖుఁడు గా వర్ణింపఁబడుట సత్యమే. అయినను లోభకారణము లగుస్వసుఖ తృష్ణల యందు జిగీషువులు నిరభిలాషు లై యుందు రనువచనంబున నది యాతనివిజిగీషుత్వమునకు హాని కలిగింపదు. ఇఁక శాంతరసాశ్రయము గానిమలయవత్యనురాగవర్ణనము శాంతనాయకునియెడ నిషిద్ధమే యగును. కాని శాంతత్వమనఁగా నహంకారరాహిత్యము. అది విప్రాదుల కౌచిత్యప్రాప్త మగునని విప్రాదిసంజ్ఞలు గలయెల్లవారికిని సంభవించునది గాదు. అట్లయిన మాధవచారుదత్తాదులు శృంగారనాయకులు గాఁజాలమిచేఁ బ్రకరణనాయకత్వహానియే సంభవించును. కావున నట్లే సకామ నిష్కామ కారుణికత్వాది ధర్మంబులఁ బ్రభిన్నం బగుశాంతత్వము శృంగారభంజకంబై సర్వాతిశాయి ప్రవర్తనుల యుదాత్తత్వమున కన్యథాత్వముఁ గలిగింపఁ జాల దనుట పూర్వలాక్షణికసమ్మత మగుటచే జీమూతవాహనాదులు నిశ్శంకముగా ధీరోదాత్తు లగుదు రని సిద్ధించుచున్నది. ఇట్లే నిరపరాధ యని తాను బరీక్షాపూర్వకంబుగా నెఱింగినసీతను లోకాపవాదంబున నడవిపాలు చేయుట రామునియుదాత్తత్వమునకుఁ గళంకము తేఁజాలక లోకారాధనమే ప్రధానముగాఁ గలయాతనిసర్వాతిశాయిత్వమును భూషించుచున్న దని యూహింపఁదగును. ఇట్లే వీరాదిరసంబుల భీమాదినాయకులు గూడ ధీరోదాత్తలక్షణంబున కుదాహరణము గాఁగలరు.



ధీరోద్ధతుఁడు :—

గీ. అమితదర్పుండు శౌర్యంబు నసహనంబు
మాయ చంచలవృత్తి యాత్మస్తవంబు
కపటమును గోపమును నహంకారము గల
వాఁడు ధీరోద్ధతుం డనఁ బరఁగుఁ గృతుల. ౬

ఇవియుఁ జాడత్వవికత్థనత్వాదిదుర్గుణంబులును గలవాఁడు ధీరోద్ధతుఁడు. ఇందులకు రావణ జామదగ్న్యాదు లుదాహరణము—ఎట్లనఁ గా మదీయమహావీరచరితంబున :—

చ. ఇరువదియొక్కసారి యొకఁడే మగపుర్వు మిగల్చకుండ భూ
వరుల వధించి కాల్వ లగువారలరక్తమునన్ మునింగి యా
దరమునఁ దర్పణం బొసఁగి తండ్రికిఁ గోపము డించినట్టినా
చరితము బాహువీర్యమును శౌర్య మెఱుంగవె సర్వభూతముల్

ఇందు ధీరలలితాశబ్దము లొక్కపుంగవంబున వర్తించువత్సవృషభమహోక్షాదిశబ్దములవలె నయ్యాగుణములచే నారోపింపఁబడిన యవస్థలను జెప్పును గాని జాతిచే నిశ్చయింపఁబడిన ధీరలలితాదులు లే రని యెఱుంగునది. అట్లయినచో జాతి యనపాయి యగుటచేఁ బూర్వమహాకవి ప్రబంధముల నొక్కనికే విరుద్ధ ధర్మము లగున నేకావస్థలు కల్పింపఁబడుట యసంగతమే కదా? అవును. ఎట్లనఁగా? మహావీరచరిత్రలోఁ బరశురాముఁ డొక్కచో ధీరోదాత్తగుణంబుల నింకొకచో ధీరోద్ధతలక్షణంబులఁ గొండొకచో ధీరశాంత ధర్మంబుల నభివర్ణింపఁబడెను. అయినను గథ కామూలాగ్రముగాఁ బ్రధాననాయకు లగురామాదులు మహాసత్త్వము గలవారు కాఁదగియుండుటచే వారి కవస్థాంతరము గల్పించుట యనుచితము గాని కథకంగభూతు లగు పరశురామాదులయెడ నవస్థాభేదకల్పన ముచితము గాక పో దని యెల్లలాక్షణికు లంగీకరించుటచే నట్టిసంశయముతోఁ బని లేదు. మఱియు ధీరోదాత్తుఁ డగు రామునకు సకపటం బగువాలివధంబున

ధీరోద్ధతావస్థ కల్పింపఁబడుటచేఁ బ్రధాననాయకులకుఁ గూడనొక్కొ క్కచోఁ గథారసస్థితి కనుకూలముగా నవస్థాంతరము గల్పించుట విరుద్ధము గా దనియు సిద్ధ మగుచున్నది. ఇట్లే వక్ష్యమాణంబు లగుదక్షిణాదినాయి కావస్థలు గూడ నంగాంగినాయకులయెడ వర్తించు నని యెఱుంగునది.
ఇఁక శృంగారనాయకావస్థలు: —

## నాయకుఁడు చతుర్విధుఁడు. ౭

దక్షిణుఁడు శఠుఁడు ధృష్టుఁడు అనుకూలుఁడు నను భేదంబుల శృంగారనాయకుఁడు నాలుగు తెఱంగుల నొప్పును. పూర్వమందుఁ జెప్పఁ బడినధీరోదాత్తాదినాయకులకుఁ బ్రత్యేకము ప్రత్యేక మీదక్షిణాదిచతు రవస్థలు గల్పించుటచే నొక్కొక్కనాయకుఁడు పదునాఱువిధము లగు చున్నాఁడు.

## సహృదయుండు దక్షిణుఁడు. ౮

ఇం కొకనాయికను గోరుచున్నవాఁ డయ్యు జ్యేష్ఠభార్యయెడ మన సు గలిగినవాఁడు దక్షిణుఁడు. ఉదాహరణము.—

మ. అనురాగంబునఁ జూచునావిభునినర్మాలాప మాలింగనం
బును బ్రేమాతిశయంబుఁజూపు వినయంబున్ నమ్మకంబున్ వినూ
తనమై తృప్తి యొసంగు నిట్టియెడ నాతం డేమియో చేసె నం
చును నేరమ్ములు విందుఁ గాని నిజ మంచున్ నమ్మ లే నోసఖీ!

## గూఢవిప్రియకారి శఠుఁడు. ౯

ఇం కొకనాయికను గోరినవాఁడై జ్యేష్ఠభార్యయెడ మనసు లేక రహస్యముగా నప్రియ మొనరించువాఁడు శఠుఁడు. ఉదాహరణము.—

ఉ. నమ్మితిఁ గాని నిన్నెఱుఁగ నాథ! శఠుండ వటంచు నన్నుఁ ద
ల్పమ్మునఁ జేర్చి యిం పొలుకఁ బల్కులు సెప్పుచు నింతలోనె మా
న మ్మది యేల? వీథిఁ జనునాఁతిపదధ్వని విన్నమాత్ర ని
క్క మ్మని నమ్మ దిట్లు చెలికత్తె యిఁ కెవ్వరితోడఁ జెప్పుదున్.



## వ్యక్తాంగవికారుఁడు ధృష్టుఁడు. ౧౦

ఇం కొకనాయికను గలియుటచేఁ గలిగినయవయవవికారములతో స్వకాంతకుఁ గన్పట్టువాఁడు ధృష్టుఁడు. ఎట్లనఁగా, అమరుకశతకంబున.—

ఉ. లత్తుకచిన్నె లొప్పఁగ లలాటమునన్, బుజబందు లొత్తఁగాఁ
గుత్తుక, మోవిఁ గాటుక దగుల్కొనఁ, దమ్మరసంబు చెప్పలం
దత్తుకొనంగ, వచ్చుప్రియునందము ప్రొద్దునఁ జూచి కిన్కచేఁ
జిత్తము నొవ్వ నొక్కసతి చేతిసరోజము నించె నూర్పులన్.

## ఏకాయత్తుఁ డనుకూలుఁడు. ౧౧

ఒక్కకళత్రము మాత్రమే కలవాఁ డనుకూలుఁడు. ఇందులకు—
మదీయోత్తరరామచరితంబునందు.—

మ. అమరున్ విశ్రమ మాత్మ కేయను సమస్తావస్థలన్, సౌఖ్యదుః
ఖములం దైక్యముఁ జెందు నేది? ముదిచే గర్హ్యంబు గా దెందు రా
గము? లజ్జాదులు పోవఁ బ్రేమభరసక్తం బౌచు నేదొప్పు? భ
ద్రము ముఖ్యంబుగఁ బ్రార్థితం బగును దద్దాంపత్య మొం డెల్లెడన్.

అట్లయినచో, నాటికానాయకు లగువత్సరాజాదులు వీరిలో నెవ్వ రగుదు రని యడిగినచో మఱి యొకనాయికను బ్రేమింప కున్నంతవఱకు ననుకూలురు పిదప దక్షిణులు నగుదు రని చెప్పవచ్చును. సరియే కాని రహ స్యము గా స్పష్టము గాఁ గూడ నప్రియ మొనరించువా రగుటచే శఠధృ ష్టులు గూడ నెట్లు కాఁదగ రని మరల నడుగవచ్చును. కాని యేదో కొం చెము విప్రియత్వ మున్నను వత్సరాజాదులు ప్రబంధపరిసమాప్తివఱకు జ్యేష్ఠ నాయికయెడ సహృదయు లగుటచే నట్లు కాఁదగ రనియు, నాయకునకు జ్యేష్ఠ కనిష్ఠ నాయికలయెడ సమానముగా ననురాగ ముండుట విరోధము గా దనియుఁ దెలుపవచ్చును. అదియుం గాక

ఇందులకు భరతాచార్యోక్తి :—

గీ. "కంతునకు లోను గాఁడు రాగంబు గొనఁడు
రమణి నిందింపఁ బొందు వైరాగ్య మట్టి

సుందరుఁడు దాతయు వికారశూన్యుఁ డైన
నాయకుం డిందు జ్యేష్ఠుఁ డనంగఁ బరఁగు."

ఇందు 'కంతునకు లోనుగాఁడు రాగంబుకోనఁడు' అని యుండుటచే దక్షిణనాయకున కొక్కతెయం దసాధారణస్నేహము నిషిద్ధ మగు నని తెలియుచున్నది. కావునఁ గావ్యపరిసమాప్తి వఱకును వత్సరాజాదులకు దాక్షిణ్య మున్న దనియే గ్రహించునది. ఇట్లగుచున్న పదాఱు భేదంబులలో మరల నొక్కొక్కదానికి జ్యేష్ఠమధ్యమాధమత్వములు గల్పించుటచే నలువదియెనిమిది నాయకభేదములు గలుగుచున్న వని యెఱుంగునది.

నాయకసహాయులు:—

పతాకానాయకుఁడు కించిదూననాయకగుణుఁడు నాయక
సహచరుండు నగువాఁడు పీఠమర్దుఁడు. ౧౨

మున్ను చెప్పినట్లు ప్రసంగవశంబున వచ్చినయితివృత్తమే పతాక. దానికి నాయకుఁడై కొంచెము తక్కువగా నెల్లగుణంబులఁ బ్రధాననాయకునిఁ బోలినవాఁడై భక్తివిశ్వాసములతో నాతనికార్యంబు నెఱవేర్ప ననుసరించి యుండు సహాయుఁడు పీఠమర్దుఁడు నాఁబడు. రామాయణంబున సుగ్రీవుఁడును మాలతీమాధవంబున మకరందుఁడు నిందుల కుదాహరణము.

ఏకవిద్యుఁడు విటుఁడు. ౧౩

ప్రధాననాయకుని రంజింపఁ జేయు గీతాదివిద్యలలో నొక్కటి చక్కగా నేర్చి నాయకునకు సహాయుఁ డగువాఁడు విటుఁ డని చెప్పఁబడును. ఇందులకు నాగానందములోని శేఖరకుఁ డుదాహరణము.

హాస్యకారి విదూషకుఁడు. ౧౪

ఏదో యొకవిధముగా నాయకునకు నవ్వు పుట్టించు సహాయుఁడు విదూషకుఁడు. శాకుంతలాదులలోని మాధవ్యాదు లుదాహరణము.



ప్రతినాయకుఁడు:—

లుబ్ధుఁడు స్తబ్ధుఁడు పాపకారి వ్యసని శత్రువు నగుధీరోద్ధతుఁడు
నాయకునకుఁ బ్రతినాయకుఁ డగును. ౧౫.

స్పష్టము. ఎట్లనఁగా? రామయుధిష్ఠిరులకు రావణదుర్యోధనులు ప్రతినాయకులు.

నాయకుని సాత్త్వికగుణములు:—

శోభాదులు నాయకగుణంబులు. ౧౬

శోభ విలాసము మాధుర్యము గాంభీర్యము స్థైర్యము తేజస్సు లలితము ఔదార్యము ననునవి యెనిమిదియు సాత్త్వికంబు లగుపురుషగుణంబులు.

శోభ చతురంగము. ౧౭.

నీచునియందు దయ, అధికునియందు స్పర్ధ, శౌర్యము సామర్థ్యము ననునవి నాల్గును శోభ కంగములు.

దయకు మదీయవీరచరితంబున:—

గీ. తాడియెత్తున గొప్పయుత్పాతమువలె
వచ్చుతాటకఁ జూడంగ వణఁకు లేక
దానిఁ జంపఁగ మునియానఁ బూని రాముఁ
డెడఁద నాఁడుది యని సంశయించుచుండె.

సధైర్యము లగుగమనవీక్షణములు సస్మితం బగుసంభా
షణమును విలాసము నాఁబడు. ౧౮

స్పష్టము. ఇందులకు మదీయోత్తరరామచరితంబున:—

ఉ. వాఁడిమిచూపు ముజ్జగముబల్మిని గడ్డిగఁ జూచు, ధైర్యముం
బోఁడిమి గర్వ మొప్పుగతి భూమి నణంచెడురీతి నుండెఁ, దా
నీడునఁ జిన్నయైనను మహీధ్రముపోల్కి గురుత్వ మొందు ని
వ్వీఁడిటు వచ్చుచుండెఁ గనవీరరసం బొకొ లేక దర్పమో?

### నిర్వికారత్వము మాధుర్యము. ౧౯.

ఎట్టియిక్కట్టులలోనైన నాకారంబున మార్పు సెందకుండుటయే మాధుర్య మనఁబడును. దీనికి నందే:—

మ. విను మోదక్షిణహస్తమా! వృషలుపై వే వేయు మీకత్తిఁ జ
చ్చినవిప్రాత్మజు జీవనౌషధము సంసిద్ధింపఁగా మోయఁ జా
లనిగర్భంబున ఖిన్న యౌనవనిబాలన్ ద్రోయఁగాఁ జాలురా
మునిగాత్రంబవు గావొకో కనికరంబుం బూన నీ కెట్లగున్!

### సంపత్తునందు విపత్తునందు నొక్కతెఱంగుగా నుండుట గాంభీర్యము. ౨౦

స్పష్టము. దీని కుదాహరణము:—

గీ. పట్టమును గట్టఁ బిలువంగఁ బడినయట్టి
యడవులఁ జరింప విముపంగఁ బడినయట్టి
యారఘుకులోత్తమునకు నాకారమందు
నించుకయు నేవికారంబుఁ గాంచనైతి.

### ఎన్ని విఘ్నములు వచ్చినను స్వప్రయత్నము విడువకుండుట స్థైర్యము. ౨౧

స్పష్టము. దీనికి మదీయవీరచరితంబున:—

గీ. పరమపావనమైనమీపలుకు వినని
పాపమున కొక్కనిష్కృతిఁ బడయువాఁడఁ
గాని విడువంగఁ జాల నిక్కాలమందు
సచ్చరితులార! నాదుశస్త్రవ్రతంబు.

### ప్రాణావసానమందైననవమానమునసహింపకునికి తేజస్సు. ౨౨

స్పష్టము. దీనికి మదీయసత్యకీర్తిలో:—

ఆ. నిన్నుఁ జంపకుండ నేఁ జచ్చువాఁడను
గాను నిక్క మింత గనుదు వీవు



"రాచపీనుఁగు తోడు రాకుండఁ జన" దను
సామెతకు ఫలంబు చక్కఁబఱుతు.

### సహజంబును మృదువును నగుశృంగారచేష్టయే లలితము నాఁబడు. ౨౩

స్పష్టము. ఉదాహరణము:—అందే.

గీ. ఎమరుగాఁ బల్కు సిగ్గుచే బెదరుఁ గాని
నాదుపల్కులు విని చిఱునవ్వు నవ్వు
నన్నుఁ గన్నారఁగాఁ జూడకున్న దీని
దృష్టినాపటమే కన నిష్టపడును.

### యావజ్జీవ మొనరించుప్రియవచనంబులతోడి దాన మౌదార్య మనఁబడు. ౨౪

స్పష్టము. ఇందులకు నాగానందంబున:—

గీ. రక్తమిదె కాఱుచుండె శిరాముఖముల
మిగిలియున్నది కండ నామేన నింకఁ
గనుపడదు నీకు సంతృప్తి గలిగినట్లు
లోవిహగరాజ! తిన కూరకుంటి వేమి?

ఇఁక నాయిక:—

### నాయిక త్రివిధ. ౨౫

నాయకసామాన్యగుణయుక్తురా లగునాయిక స్వీయ పరకీయ సామాన్య యని మూఁడు తెఱంగు లగుచున్నది.

### స్వీయ త్రివిధ. ౨౬

అందు లజ్జాశీలార్జవాదిసుగుణంబులు గలస్వీయ, ముగ్ధ మధ్య ప్రౌఢ యనుభేదంబులఁ ద్రివిధ యగుచున్నది. ఉదాహరణము:—

గీ. కనుఁడు కులకాంతకు మనోవికారలలిత
విభ్రమాదికయౌవనవిలసితములు

ప్రియునితోఁ గూడ నెందేని వెడలి మరల
నతఁడు వచ్చినచో వచ్చినట్టు లుండు.

**నవవయఃకామయు రతివామశీలయు మృదుకోపయు నగునది ముగ్ధ. ౨౭**

ఒక్కరతివామశీల కుదాహరణము:—

చ. తనచెలికత్తె లెట్లొ గదితల్పు బిగింపఁగ లాగు డాఁగు మా
లను బిలువంగ రాదు చెయి లాగిన శయ్యకుఁ జేరుఁ బల్కరిం
చిన బదు లీదు పోఁ దలఁచుఁ జీరచెఱంగును లాగఁ గిన్కఁ జూ
పును శయనించు బోరగిలి ముగ్ధరతిన్ బతి కూర్చు నెట్టులున్.

**సంప్రాప్తయౌవనకామయు మోహాంతసురతయోగ్యయు నగునది మధ్య. ౨౮**

ఒక్కయధీరమధ్య కుదాహరణము:—

ఉ. కూరిమి హెచ్చుచున్న మదిఁ గోరిక లూరుచునున్న యొమ్మువోం
గారుమనున్న మేను పులకాంకురితం బగుచున్న మోమునన్
దీరుగ నున్న లేఁజెమట ధీరత లేనిశఠాగ్రణి భర్తనిం
పారఁగఁ గౌఁగిలింప మదిమాత్రము నెందియు నాఁగు సిగ్గునన్.

**యౌవనాంధయు స్మరోన్మత్తయు నత్యంత సురతోత్సుకయు నగునది ప్రౌఢ. ౨౯**

ఒక్కరతప్రగల్భ కుదాహరణము:—

మ. చెలియా! రేయి ప్రియుండు తల్పమున విచ్చేయంగ నుప్పొంగె మే
నల కైదండ గళంబు సేరఁగఁ దనంతన్ నీవి జాఱెన్ గటి
స్థలిపై మాత్ర మొకింత చీర రశనాసంబద్ధమై నిల్చె నా
వల నే మయ్యెనొ నే నెవర్తె నతఁ డెవ్వండో యెఱుంగన్ గదా!

దృశ్యకావ్యములలోనిది కానియీపద్యమును ధనికుఁ డుదాహరించుటయే రూపకంబుల నిట్టివర్ణన మనుచితమని తెల్పుచున్నది.



ఇట్లు త్రివిధ యగుస్వీయనాయిక మరల ధీరాధీరాదినామంబుల ననేకభేదంబు లొందుచున్నది. కాని యాభేదంబు లన్నియుఁ గావ్యాలంకారసంగ్రహాదులయందు వివరింపఁబడియుండుటచే నిందనావశ్యకంబు లని మరల వివరింపలేదు.

**పరకీయ ద్వివిధ. ౩౦**

అన్యోఢ, కన్య యని. ఒకనిచేఁ బెండ్లి యాడఁబడినది యన్యోఢ. ఇది సత్కావ్యంబుల నంగి యగుప్రధానరసంబున నెందును నాయిక గా నుండఁ దగ దని వివరింప లేదు. కన్య పెండ్లి యయినది గాక పోయినను దల్లిదండ్రుల కధీనురాలగుటచేఁ బరోఢవలెనే పరకీయ యగుచున్నది. ఇతరుల యడ్డమువలనఁ గాని దనభార్యవలనిభయంబునఁ గాని దీనియం దనురాగము ప్రచ్ఛన్నము కాఁదగును. ఇందులకు మాలతియెడ మాధవునకును సాగరికయెడ వత్సరాజునకును గలప్రేమయే యుదాహరణము. కాని కన్యానురాగంబు గూడ రత్నావళీనాగానందములయందు సాగరికమలయవతులయనురాగమువలె స్వేచ్ఛగాఁ బ్రధానాప్రధానరసాశ్రయముగా వర్ణింపఁదగును.

**కలానిపుణయు ధీరయు నగువేశ్య సామాన్య యనఁబడు. ౩౧**

దీనివ్యవహారము గ్రంథాంతరములయందు వర్ణింపఁబడినది గావున నిందుఁ గొంచెముగా సూచింపఁబడును. రహస్యకాముకులను, ననాయాసంబుగ ధనము సంపాదించినయజ్ఞానులను, మూర్ఖులు దుస్సహవాసులు నగు స్వతంత్రులను, లజ్జవిడిచి నిరంకుశంబుగఁ దిరుగుధనికులను నిజముగా ననురాగము గలదానివలెఁ గామించి ధనము సంగ్రహించినవెనుకఁ దల్లిచేఁ గాని దూతికచేఁ గాని వారి నిల్లు వెడలఁగొట్టించుట వేశ్యకు స్వాభావికము.

**ప్రహసనేతరరూపకంబుల ననురక్త యగుగణిక నాయిక కాఁదగును. ౩౨**

ప్రహసనము దక్కఁ దక్కినప్రకరణాదిరూపకంబుల నిజమైనయనురాగము గలసామాన్య ప్రయోగింపఁదగును. ఇందులకు మృచ్ఛకటికయం.

దలివసంతసేనయే యుదాహరణము. ఇఁకఁ బ్రహసనంబున ననురక్త కాక పోయినను హాస్యకారిణి గానుండఁదగును.

### ఉత్తమనాయకరూపకంబుల వేశ్య తగదు. ౩౩

రాజర్షులు దివ్యపురుషులు నాయకులు గాఁగల నాటకాదిరూపకంబుల వేశ్య విధింపఁదగదు. విక్రమోర్వశీయంబున నూర్వశి లోకసామాన్య యగుసామాన్య గాక దివ్యాంగన యని యెఱుంగునది.

ఇఁక నాయికాభేదములు:—

### స్వాధీనపతికాదిభేదంబున మరల నాయిక యష్టవిధ యగును. ౩౪

స్వాధీనపతిక వాసకసజ్జ విరహోత్కంఠిత ఖండిత కలహాంతరిత విప్రలబ్ధ ప్రోషితభర్తృక అభిసారిక యను భేదంబుల నొక్కొక్కనాయిక యెనిమిదియవస్థల నొందుచున్నది. ఈభేదంబులకు లక్షణములు మాత్ర మిందు నుడువఁబడుచున్నవి.

గీ. తనకుఁ బతివశ్యుఁ డగుట సంతసము నొందు
మానినీరత్న మగును స్వాధీనపతిక. ౩౫
ప్రియునిరాకఁ గని యలంకరించికొనుచు
శయ్య సవరించు వాసకసజ్జ ప్రీతి. ౩౬
జాగు సేయంగ బ్రియుఁడు విషణ్ణహృదయ
యగునతివ విరహోత్కంఠితాఖ్య యగును. ౩౭
అన్యరమణిని గలియుచిహ్నములఁ గనుచుఁ
గాంతునెడ నీర్ష్యపడునది ఖండిత యగు. ౩౮
అల్కచే ముందు ప్రియు విడనాడి వెనుకఁ
దాపపడుజవ్వని కలహాంతరిత యగును. ౩౯



చెప్పిన ట్లెల్లఁ బ్రియుఁ డిల్లు సేర కున్న
వికలమానస యగునది విప్రలబ్ధ. ౪౦
పని గలిగి దూరదేశంబు చనినయట్టి
భర్త గలయది ప్రోషితభర్తృక యగు. ౪౧
కామపీడిత యగుచుఁ దాఁ గాంతునెడకుఁ
జక్కఁగాఁ బోవునది యభిసారిక యగు. ౪౨

విరహోత్కంఠిత మొదలుగా నాలుగురు నాయికలు క్రమముగా—చింత నిశ్శ్వాసము ఖేదము అశ్రువు వివర్ణత గ్లాని భూషణరాహిత్యము అను లక్షణంబులతోఁ గూడి యుందురు. ఇఁక స్వాధీనపతిక వాసకసజ్జలు క్రమముగాఁ గ్రీడ హర్షము అనున నుభావములతోఁ గూడి యుందురు.

మఱియుఁ బరకీయ లగుకన్య పరోఢయు సంకేతముకంటెఁ బూర్వమందు విరహోత్కంఠితలు విదూషకాదులసహాయంబున నాయకునిఁ జేరిన పిదప నభిసారికలు నగుదురు. ఏకారణముచే నయిన సంకేతస్థానముఁ జేరఁ బోయిరేని విప్రలబ్ధ లగుదురు. అస్వాధీనప్రియ లగువీరి కవస్థాంతరము సంభవింపదు గావున నిట్లు వ్యవస్థ యేర్పఱుచుకొనునది.

సహాయనాయికలు:—

### దాస్యాదిదూతికలు నాయికాసహకారిణులు. ౪౩

నాయకమిత్రు లగుపీఠమర్దాదుల గుణంబులతోఁ గూడినదాసి చెలి కత్తె రజకి పెంపుడుతల్లికూఁతురు సమీప మందున్నపరభామిని భిక్షుకి శిల్పిని యనుదూతికలు నాయికలయభీష్టంబు నెఱవేర్ప సహాయ మొనరింతురు. తనకుఁ దానే దౌత్యము నిర్వహించుకొనుట కూడఁ గలదని కొందఱమతము.

నాయికాలంకారములు:—

### సాత్త్వికభావంబు లలంకారంబులు. ౪౪

భావము హావము హేలయను శరీరజంబులు మూఁడును, శోభ కాంతి మాధుర్యము దీప్తి ప్రగల్భత ఔదార్యము ధైర్యము నను నప్రయ

త్న సిద్ధంబులేదును, లీల విలాసము విచ్ఛిత్తి విభ్రమము కిలికించితము మోట్టాయితము కుట్టమితము బిబ్బోకము లలితము విహృతము నను స్వభావజంబులు పదియును, సాత్త్వికభావంబు లనుపేర రూపకనాయికలకు జవ్వనంబున నలంకారంబు లగును. వీనికి లక్షణంబు లిట్లు క్రమముగా నరయునది.

గీ. నిర్వికారసత్త్వమునుండి నెగడి మదిని
బరఁగు మొదటి వికారంబు భావ మగును. ౪౫
అవయవవికారకారి యై యాశయంబు
నలరఁ దెల్పుశృంగారంబు హావ మగును. ౪౬
వ్యక్తశృంగారరససూచనాఢ్య మగుచు
నిట్టిహావంబె పే రొందు హేల యనఁగ. ౪౭
ఆకృతియు జవ్వనంబును నంగములకు
శోభ గలిగించుటయె యిందు శోభ యగును. ౪౮
సహజరాగావతారసంజనిత మైన
ఛాయ గలశోభయే కాంతిసంజ్ఞఁ జెందు. ౪౯
పైకి విస్పష్టముగఁ దోఁచఁబడక యుండు
కాంతి మాధుర్య మనుపేరు గాంచుచుండు. ౫౦
కనులపండువుగాఁ బైకిఁ గానఁబడెడు
కాంతియే దీప్తి యనఁగ విఖ్యాతిఁ జెందు. ౫౧
నిర్భయవిచారభావంబు నిపుణము నగు
నట్టినడవడి ప్రాగల్భ్య మనఁగఁబరఁగు. ౫౨
కినుకఁ గష్టంబుఁ గన నీక కృత్యదక్ష
మైనయనునయ మౌదార్య మనఁగ నొప్పు. ౫౩



ఎత్తఱిని జంచలింపనిచిత్తవృత్తి
గలిగి యుండుట ధైర్య మై వెలయుచుండు. ౫౪
వేషభాషలఁ జేష్టలఁ బ్రియుని సరిగ
ననుకరించుటయే లీల యనఁగఁబడును. ౫౫
ప్రియునిఁ గనునట్టియెడ మేనఁ గ్రియలఁ బల్కు
లను విశేషంబుకలిమి విలాస మగును. ౫౬
భూషణము లల్ప మైనను బూర్ణశోభ
నందఁజేయుట విచ్ఛిత్తి యై యెసంగు. ౫౭
ప్రియుఁడు రాఁ జూచి భూషలు వేగ తాఱు
మాఱుగాఁ బూనుటే విభ్రమంబు దలఁప. ౫౮
భయవినయబాష్పహాసకోపప్రహర్ష
సంకరమె కిలికించితసంజ్ఞఁ జెందు. ౫౯
ఏకథల విన్నఁ బ్రియు వృత్త మెంచి దాని
కనుగుణంబుగ నునికి మోట్టాయితంబు. ౬౦
ప్రియునిసరసంపుఁగ్రియలకు వేడ్క పడియుఁ
గోపము నటించుటయె యగుఁ గుట్టమితము. ౬౧
గర్వభావంబున ననుంగుఁగాంతునియెడఁ
బొడమెడునానాదరంబు బిబ్బోక మగును. ౬౨
అధికసుకుమారహస్తపాదాద్యవయవ
లలితవిన్యాసమే తగు లలిత మనఁగ. ౬౩
తగినతఱి వచ్చినను జెప్పఁ దగినమాట
వ్రీడచేఁ జెప్ప కుండుటవిహృత మగును. ౬౪

కార్యాంతరసహాయులు.—

## మంత్రి స్వోభయాత్మకము సహాయము. ౬౫

నాయకునకుఁ గార్యాలోచనంబున మంత్రి గాని తనకుఁ దానే గాని యుభయము గాని సహాయము గాఁదగును.

## కేవల మంత్రిసహాయుడు లలితుఁడు. ౬౬

కేవలము మంత్రివలనఁ గార్యసిద్ధిని గాంచువాఁడు ధీరలలితుఁడు. ధీరోదాత్తాదులకుఁ బూర్వోక్తలక్షణమే చెల్లును.

## ఋత్విగాదులు ధర్మసహాయులు. ౬౭

ఋత్విక్కు. పురోహితుఁడు తాపసులు బ్రహ్మవేత్తలు ధర్మంబున నాయకునకు సహాయు లగుదురు.

## మిత్రాదులు దండసహాయులు. ౬౮

మిత్రుఁడు పుత్రుఁడు సామంతులు సైనికులు ఆటవికాదులును దుష్టజనశిక్షణంబున సహాయు లగుదురు.

## వర్షవరాదు లంతఃపురసహాయులు. ౬౯

వర్షవరుఁడు కిరాతుఁడు మూకవామనులు మ్లేచ్ఛులు ఆభీరులు. శకారుఁడు మొదలుగాఁ గలవారు నాయకున కంతఃపురంబునఁ దమతమ పనుల నెఱవేర్చుచు సహాయ మొనరింపఁదగుదురు. వర్షవరుఁ డనఁగా హెగ్గడికాఁడు. శకారుఁ డనఁగా హీనజాతివాఁ డగురాజశ్యాలకుఁడు. ఇట్లు నిరూపింపఁబడిన నాయికా నాయక దూతీ దూత మంత్రి పురోహితాదుల యుత్తమ మధ్య మాధమ భావములు వారివారి గుణాతిశయ తారతమ్యంబున నిరూపించు కొనందగును.

నాయకవ్యాపారము:—

## నాయకవ్యాపార స్వభావము వృత్తి. ౭౦

నాయకుఁ డొనరించు వ్యాపారముయొక్క ధర్మము వృత్తి యనఁబడును.



## అది చతుర్విధము. ౭౧

ఆ వృత్తి, కైశికి సాత్వతి ఆరభటి భారతి యను భేదంబుల నాలుగు విధము లగుచున్నది. అందు గీతనృత్యవిలాసకామాదులతోఁ గూడి మృదువైన శృంగారవ్యాపారము కైశికి యని చెప్పఁబడును.

## అయ్యది చతుర్విధంబు. ౭౨

నర్మము నర్మస్ఫింజము నర్మస్ఫోటము నర్మగర్భము నను భేదంబులఁ గైశికి మరల నలుతెఱంగు లగుచున్నది.

## అగ్రామ్య పరిహాసము నర్మము. ౭౩

ఇష్టజనంబును రంజింపఁ జేయునృదు వైన హాస్యము నర్మ మనఁబడును. ఆది హాస్యనర్మము భయనర్మము శృంగారనర్మము నని త్రివిధ మగుచున్నది. ఇందు శృంగారనర్మము, అనురాగనర్మము సంభోగనర్మము మాననర్మము నని మూఁడుభేదంబులం గలిగి యున్నది. భయనర్మము శుద్ధభయనర్మము శృంగారభయనర్మము నని ద్వివిధముగా విభజింపఁ బడుచున్నది. ఇట్లాఱువిధము లైనయీనర్మము మరలఁ బ్రత్యేకము వచోనర్మము వేషనర్మము చేష్టానర్మము నను భేదంబులఁ బదునెనిమిది విధము లగుచున్నది. ఈయెల్లనర్మంబులుగూడ హాస్యముతోఁ గూడి యుండుననియే గ్రహింపఁదగును. ఇందులకు దిఙ్మాత్రంబుగ నుదాహరణములు—నాగానందమున—విదూషక శేఖరకుల వ్యతికరము వేషనర్మము. మాలవికాగ్నిమిత్రంబున—నిపుణిక నిద్రించువిదూషకుని ఱొమ్ముమీఁద సర్పభ్రాంతి గలిగించు దండకాష్ఠంబు నుంచుట చేష్టానర్మము. రత్నావళిలో—చిత్రదర్శనసమయంబున సుసంగత వచ్చి "చిత్రఫలకంబుతోఁ గూడ నా కీవృత్తాంత మంతయుఁ దెలిసినది. దేవికిఁ జెప్పెదను" అని భయపెట్టుట భయనర్మము. ఇట్లే తక్కిన యెల్లనర్మంబుల కుదాహరణంబు లూహ్యంబులు.

సుఖారంభము భయాంతంబు నగుప్రయత్నము
నర్మస్ఫింజము. ౨౪

నాయికానాయకులు క్రొత్తగాఁ గలిసికొనుట సుఖముతో నారంభించి భయముతో సమాప్తినొందెనేని యది నర్మస్ఫింజ మనఁబడును.

ఇందులకు:—మాలవికాగ్నిమిత్రుల నూతనసమావేశముదాహరణము.

భావసూచితం బగునను రాగము
నర్మస్ఫోటము. ౨౫

తొలుత మెల్లమెల్లగా దర్శనసంభాషణాదులచే ననురాగము సూచించుట నర్మస్ఫోట మనఁబడు. ఇది శృంగారరస రూపక సామాన్యధర్మము.

సపరిహాసం బగుకపటవ్యాపారము నర్మగర్భము. ౨౬

నవ్వుటాలకట్లొరులఁ గన్నుగప్పి తనకార్యము నెఱవేర్చుకొనుట నర్మగర్భ మనఁబడును.

ఇందులకు:—ప్రియదర్శికలో గర్భాంకంబున—వత్సరాజవేషమును ధరించినసుసంగతస్థానంబున నిజముగా వత్సరాజే వచ్చి ప్రవేశించుటయుదాహరణము.

విశోకంబు సత్త్వాదిభూషితంబు నగువ్యాపారము సాత్త్వతి. ౨౭

నిర్విచారంబై సత్త్వశౌర్యదానదయాహర్షాదిభావంబులఁ బ్రశస్తంబై యొప్పు నాయకవ్యాపారము సాత్త్వతి యనఁబడును. దీనికి సంలాపకము, ఉత్థాపకము, సాంఘాత్యము, పరివర్తకము నని నాలు గంగములు గలవు. అందు—

నానాభావరసాత్మకం బగుగభీరోక్తి సంలాపకము. ౨౮

ఇందులకు:—వీరచరితములో—

రాముఁడు:—తొల్లి సపరివారంబుగఁ గార్తికేయుని గెలిచినశక్తి సంతసించినయీశ్వరుండు వేయేండ్లు శిష్యుఁడవుగా నున్ననీ కనుగ్రహించినపరశు విదియే కాదా?



పరశురాముఁడు:—రామా! ఔనౌను.

ఆహహా గుహువ్యాసకుఁ బ్రియ మైన గండగొడ్డలి యిదియే.

శత్రూత్థాపన ముత్థాపకము. ౨౯

ముందుగా శత్రువును బిలిచి యుద్ధమునకు లేవ నెత్తుట యుత్థాపక మనఁబడు. ఇందులకు వీరచరితలో—శ్రీరాముని ముందుగా సంగరమునకుఁ బిల్చినపరశురామునివ్యాపార ముదాహరణము.

సంఘభేదనము సాంఘాత్యము. ౩౦

మంత్రశక్తిచేఁ గాని యర్థశక్తిచేఁ గాని దైవశక్తిచేఁ గాని మిత్రభేదము కల్పించుట సాంఘాత్య మనఁబడును. ఎట్లనఁగా:—

ముద్రారాక్షసంబున:—చాణక్యుఁడు మంత్రశక్తిచే రాక్షసునిమిత్రులను విడఁదీసెను.

అందే అర్థశక్తిచే:—పర్వతకుని యాభరణములు రాక్షసునిచేతఁ బడునట్లు చేసి మలయకేతువునకు విరోధము పుట్టించెను.

దైవశక్తిచే:—రామాయణంబున రావణవిభీషణులకు భేదము సంభవించెను.

ప్రకృతకార్యము పరిత్యజించి కార్యాన్తరము
చేయుట పరివర్తకము. ౩౧

ఎట్లనఁగా:—వీరచరితంబున.

పరశురాముఁడు:—రామా! వినాయకుని దంతపుఁబోటులచేతను గుమారస్వామి బాణములదెబ్బలచేతను గాయలు గాచిననాయొమ్ము నిన్ను గౌఁగిలింపఁ గోరుచున్నది.

రాముఁడు:—స్వామీ! కౌఁగిలింత యనునది ప్రస్తుతకార్యవిరుద్ధము. (ఇత్యాదికము.)

## మాయాదివ్యాపార మారభటి. ౮౨

మాయ, ఇంద్రజాలము, సంగ్రామము, క్రోధము మొదలగు చేష్టలచే నారభటీవృత్తి విలసిల్లును. అపుడు లేనివస్తువును మంత్రబలమునఁ గల్పించుట మాయ యనియుఁ దంత్రబలంబునఁ గల్పించుట యింద్రజాల మనియుఁ జెప్పఁబడును. దీనికి సంక్షిప్తిక సంఫేటము వస్తూత్థాపన మవపాతనము నని నాలుగంగములు గలవు. అందు—

## శిల్పయోగంబున వస్తురచన సంక్షిప్తిక. ౮౩

శిల్పముచే నూతనవస్తువును నిర్మించుట సంక్షిప్తికయనఁబడును. ప్రతిజ్ఞాయౌగంధరాయణంబునఁ గిలింజిహస్తిప్రయోగ ముదాహరణము. లేదా, ఒకనాయకున కవస్థాంతరము గల్పించుట సంక్షిప్తి యని కొందఱందురు. పరశురామునకు నౌద్ధత్యమును మాన్పి శాంతత్వమును గల్పించుట యుదాహరణము.

## ద్వంద్వయుద్ధము సంఫేటము. ౮౪

ఇందులకు :—మాధవాఘోరఘంటులయు, ఇంద్రజిల్లక్ష్మణులయు సంగ్రామ ముదాహరణము.

## కృత్రిమవస్తువు వస్తూత్థాపనము. ౮౫

మాయేంద్రజాలాదులచేఁ గల్పింపఁబడినవస్తువనియర్థము. ఎట్లనఁగా:—

ఉదాత్తరాఘవములో:—రాక్షసునిచేఁ గల్పింపఁబడిన కటికిచీఁకటిగుంపులచే సూర్యకిరణములుగూడ జయింపఁబడిన వని వర్ణింపఁబడినది.

## భయకంపాదిజనకం బగువ్యాపార మవపాతనము. ౮౬

ఎట్లనఁగా:—రత్నావళిలో:—అంతఃపుర సేవకులెల్ల భయపడు నట్లుగా గుఱ్ఱపుసాలనుండి విడిపించుకొని వచ్చినకోఁతి నగరు ప్రవేశించుచున్న దని వర్ణింపఁబడినది.



## భారతి సార్వత్రికము. ౮౭

హాస్యాదిరసములు భారతీవృత్త్యాత్మకంబు లగుటచేతను, రసహీనం బగుకావ్యార్థము లేకపోవుటచేతను అర్థవృత్తు లగుకైశిక్యాదులకంటె వేఱుగా శబ్దవృత్తి యగుభారతికి లక్ష్యము కనుపడదు. కావున నిది పైమూఁడు వృత్తులలో నంతర్భూత మగుచున్న దని ధనంజయమతము. ఇఁక వృత్తినియమ మిట్లుచూడఁ దగును.

గీ. పొసఁగుఁ గైశికి శృంగారరసమునందు
వీరరసమున సాత్వతి వెలయుచుండు
రౌద్రబీభత్సములను నారభటి చెలఁగు
నెల్లయెడ భారతీవృత్తి యెసఁగుచుండు. ౮౮

ఇఁకఁ బ్రవృత్తి.

## దేశాదియోగ్యం బగునాయకాది వ్యాపారము ప్రవృత్తి నాఁబడు. ౮౯

దేశమునకు భాషకు వేషంబునకుఁ గ్రియకుఁ దగినట్లుగా నున్ననాయకాదులవ్యాపారమునకుఁ బ్రవృత్తి యని పేరు. ఇది లోకానుభవంబున నౌచిత్యా బెఱింగి ప్రయోగింపఁ దగును.

* అందు భాష:—

## భాషాప్రయోగంబున నాంధ్రరూపకములు సంస్కృతరూపకతుల్యంబులు గావు. ౯౦

సంస్కృతరూపకంబుల స్త్రీనీచపాత్రముల కుపయోగింపఁ దగిన మాగధి శౌరసేని మొదలగుప్రాకృతభాషలవలె నాంధ్రరూపకంబుల నుపయోగింపఁ దగిన కొండొకభాష లేదు. కావున భాషావిషయంబున నివి

---

* ఈభాషానిర్ణయ మాంధ్రరూపకముల కుచితమగురీతిని విద్వత్సమ్మతముగాఁ గల్పింపఁబడినది.

వానిం బోలవు. అట్లయినచో నాంధ్రరూపకంబుల నెట్టిభాష ప్రయోగింపఁ దగు ననఁగా:—

### సలక్షణాంధ్రంబు సార్వత్రికంబు. ౯౧

వ్యాకరణసిద్ధం బయిన తెలుఁగు సర్వపాత్రసామాన్యంబు గాఁ బ్రయోగింపవలయును. ఇఁక దాని యౌచిత్యవిశేషం బి ట్లెఱుంగునది.

### తత్సమప్రాయం బుత్తమంబులకుఁ దదన్యంబు నీచంబులకు నుచితంబు. ౯౨

రాజమంత్రిపురోహిత మిత్రాదులగు పురుషులును, యోగిని మహాదేవి మంత్రిపుత్రిక మొదలగుస్త్రీలు నిం దుత్తమపాత్రంబులు. వీరియెడఁ దఱచుగా లలితంబు లగు తత్సమ పదంబులతోఁ గూడినభాష ప్రయోగింప నుచితంబు. ఇతరంబు లగు దూతీదూతభటవిదూషకాది స్త్రీపురుషపాత్రంబులకుఁ దఱచుగాఁ దద్భవదేశ్య పదంబులతోఁగూడినభాష ప్రయోగించుట యుచితంబు.

### ఇందు గ్రామ్యం బసభ్యం బప్రయోజ్యంబు. ౯౩

చూపఱ కానందంబు గలిగింప నర్తకు లనుకరించు శృంగారవీరకరుణాది రసాత్మకంబు లగునీరూపకంబుల సభారంజకంబుగాని నిరర్థ్యగ్రామ్యం బెల్లవిధములఁ బ్రయోగింపఁ దగ దని యెఱుంగునది.

ఇఁక నామంత్రణంబు:—

### తాపసాదులు భగవచ్ఛబ్దయోగ్యులు. ౯౪

మునులు దేవర్షులు విద్వాంసులు సన్యాసులు రూపకంబుల భగవచ్ఛబ్దంబునఁ బిలువఁ దగుదురు.

### విప్రాదు లార్యపదయోగ్యులు. ౯౫

బ్రాహ్మణులు మంత్రులు జ్యేష్ఠసోదరులును ఆర్య (అయ్యా) పదంబునఁ బిలువఁ దగుదురు.



### నటీసూత్రధారులు పరస్పరమట్లే. ౯౬

ఒండొరు లార్యపదం బుపయోగింపఁ దగుదురు.

### సూతునకు రథికుఁ డాయుష్మంతుఁడు. ౯౭

రథము నడపువాఁడు రథారూఢుని "ఆయుష్మంతుఁడా" యని పిలువఁదగును.

### శిష్యాదులు వత్సపదయోగ్యులు. ౯౮

శిష్యుఁడు పుత్రుఁడు తమ్ముఁడు మొదలగు చిన్నవారిని బూజ్యు లగువారు 'వత్స' యని పిలువఁదగును. ఆదరాతిశయంబున, నాయన, తండ్రి మొద లగుపదంబులచేఁ గూడఁ బిలువఁ దగును.

### పూజ్యులు గుర్వాదిపదయోగ్యులు. ౯౯

పూజింపఁ దగినపెద్దలు శిష్యాదులకు "గురు, జనక, తాత, పూజ్య, పూజ్యపాదా" దిపదంబులఁ బిలువఁ దగుదురు.

### సూత్రధారపారిపార్శ్వకులుభావమారిషపదవాచ్యులు. ౧౦౦

సూత్రధారుఁడు పారిపార్శ్వకుని 'భావ' యనియు నతని నాతఁడు 'మారిష, మార్ష' యనియుఁ బరస్పరము యథాక్రమంబుగఁ బిలువఁ దగును.

### రాజు దేవాదిపదవాచ్యుఁడు. ౧౦౧

రాజును భృత్యులు 'దేవ, స్వామి, మహారాజ' యనియు నీచులు "భట్టారక, మహాప్రభూ" యనియుఁ బిలువఁ దగును.

### పట్టమహిష్యాదులు దేవ్యాదిపదయోగ్యులు. ౧౦౨

రాజదేవతాపసాదులభార్యలను సకలభృత్యులును 'దేవి, స్వామిని, మాత' యని పిలువఁదగును. విదూషకుఁడు పట్టమహిషిని "రాజ్ఞి, భవతి" యని పిలువఁదగును.

రాజనామోచ్చారణంబు నిషిద్ధంబు. ౧౦౩

ఎట్టివారైనను రాజును పేరుతోఁ బిలుచుట దగదు.

రాజవిదూషకులు పరస్పరము వయస్యపదవాచ్యులు
(స్పష్టము). ౧౦౪

నాయికావయస్య లన్యోన్యము సఖీపదవాచ్యలు
(స్పష్టము.) ౧౦౫

శిష్టసంబోధనంబు యథోచితంబుగ గ్రాహ్యము. ౧౦౬

మిగిలినపాత్రముల పరస్పరాహ్వానము మహాకవిప్రయోగములంబట్టి యథోచితంబుగ గ్రహింపఁ దగును.

ఇది ఆంధ్రదశరూపకం బనుదృశ్యకావ్యశాసనంబున
నాయకప్రకాశ మనుద్వితీయప్రకరణము.

---

శ్రీరస్తు.

# ఆంధ్రదశరూపకము.

## తృతీయప్రకరణము.

---

### రూపకప్రకాశము.

వస్తునాయకభేదప్రతిపాదనానంతర మిందు రసవిచారం బతిక్రమించి ముందుగా రూపకంబులకు లక్షణంబులును వస్తునాయకరసంబులకు వానియం దుపయోగంబును బ్రతిపాదింపఁబడుచున్నవి. అం దెల్లరూపకంబులకుఁ బ్రకృతియు సంపూర్ణలక్షణంబు నగునాటకమును గూర్చి యి ట్లెఱుంగునది.

గీ. పూర్వరంగంబు నొనరించి మొదలఁ జనఁగ
సూత్రధారుండు, రంగముఁ జొచ్చి వాని
యట్లె వే ఱొక్కనటుఁడు కావ్యార్థసూచ
నంబు సేయంగఁ దగు రూపకంబులందు. ౧

సూత్ర మనఁగా సబీజకం బగునాట్యానుష్ఠానము. దానిని బ్రవర్తింపఁజేయువాఁడు సూత్రధారుఁడు. పూర్వరంగ మనఁగా నాట్యశాల. దానియందు నిర్విఘ్నముగా నాట్యప్రదర్శనము జరుగుటకై రూపకాదియందుఁ జేయఁదగిన కృత్యవిశేషము పూర్వరంగ మనఁబడును. నాటకంబున దీని కిరువదిరెం డంగములు గలవు. వానిలో ముఖ్యముగా విఘ్నశాంతికై చేయఁదగినది నాంది. దశవిధరూపకంబులమొదల నుండు నాశీర్నమస్క్రియాది

రూపం బగుమంగళాచరణపద్యంబు నాంది యనంబడును. ఇది *యెనిమిది గాని పంద్రెండు గాని పదునెనిమిది గాని యిరువదిరెండు గాని పదంబులతోఁ గూడి యర్థముచేఁ గాని శబ్దముచేఁ గాని కొంచెముగాఁ గావ్యార్థమును సూచించునది గా నుండఁ దగును. ఇట్టి నాందీరూపం బగు పూర్వరంగ మొనరించి సూత్రధారుఁడు వెడలినపిదప నాకారగుణంబుల వానినిఁ బోలిన యింకొకనటుఁ డానామంబుతోనె రంగభూమిఁ బ్రవేశించి కావ్యార్థసూచనము చేయవలయు. దీనింబట్టి సూత్రధారులిద్ద ఱనియు నందొకఁడు పూర్వరంగప్రవర్తకుఁ డనియు నటుఁడు స్థాపకుఁడునని మఱిరెండు పేర్లు గలిగిన రెండవసూత్రధారుఁడు ప్రస్తావనాప్రవర్తకుఁ డనియు నెఱుంగునది. మఱియు నీప్రసంగంబున నాటకాదులలోఁ గన్పడు "నాంద్యంతమున సూత్రధారుఁడు" అను దానికి నాంది యొనరించి మొదటివాఁడు వెడలినపిదప రంగస్థలంబుఁ బ్రవేశించిన రెండవ సూత్రధారుఁ డని గ్రహించునది.

గీ. కథకుఁ దగినయవస్థను గలద్వితీయ
సూత్రధారుండు దా వస్తుపాత్రబీజ
ముఖములం దొకదానిని ముఖ్యముగ రు
చింప సభ్యులమదికి సూచింపవలయు. ౨

దివ్యమర్త్యమిశ్రరూపంబు లగునితివృత్తములకుఁ దగిన యాకారాదులు గలవాఁ డగు నితఁడు మొదలఁ గావ్యార్థసూచకంబు లగు చక్కని పద్యములచే రంగభూమినిరంజింపఁజేసి పిదప వస్త్వాదులనుసూచింపఁదగును.

వస్తువునకు, ఉదాత్తరాఘవంబున:—

"శ్రీరాముఁడు పెద్దలయానతి శిరసా వహించి యడవికి వెళ్లెను. అతనియందలిభక్తిచేఁ దల్లితోఁగూడ సమస్తరాజ్యమును భరతుఁడు విడిచెను. తన్నాశ్రయించిన సుగ్రీవవిభీషణులను రాముఁ డనుగ్రహించి రక్షించెను. దశకంధరాదిశత్రువు లెల్లరు నశించిరి" అనుప్రస్తావనలోని వాక్యములు ప్రదర్శింపఁ బోవుకథను దెల్పుచున్నవి.

* కొందఱు కవులు నాందికిఁ బదనియమమును బాటింపలేదు.



పాత్రమునకు, శాకుంతలములో:—

"అతివేగము గలిగినజింకచే నీదుష్యంతునివలెనే మనోహరం బగునీగీతరాగంబున నే నాకర్షింపఁబడితిని" ఇందుఁ బాత్రము సూచింపఁబడినది.

బీజమునకు, రత్నావళిలో:—

"ద్వీపాంతరమునుండి గాని సముద్రమధ్యమునుండి గాని దిగంతములనుండి గాని తీసికొనివచ్చి యనుకూలదైవ మభిమతవస్తువును సమకూర్చును" అనువాక్యములఁ గథాబీజము సూచింపఁబడినది.

ముఖమునకు, మదీయసత్యకీర్తిలో:—

గీ. ధైర్యమును సాహసంబును దనరె నేని
యెట్టికార్యంబు నే నిర్వహింపవచ్చు
సమయగతిఁ గానవా లగుసత్యకీర్తి
కష్టపడి తనరాజ్యము గాంచినట్లు.

ఇందుఁ గథాముఖము సూచింపఁబడినది.

రంగప్రసాదనంబు ఋతుగానంబును భారతీవృత్తి
మూలకంబులు గాఁదగు. ౩

భారతీవృత్తి నాశ్రయించి నటాదులు చక్కనిపద్యములచే రంగమును రంజింపఁజేసి యేదైన నొకఋతువు ననుసరించి గానము చేయఁదగును. పూర్వనాటకంబులఁ దఱచుగా లేక పోవుటచే ఋతుగాన మైచ్ఛిక మని యెఱుంగునది.

శుద్ధంబగు వాగ్వ్యాపారము భారతి. ౪

సలక్షణాంధ్రప్రాయంబును నటాద్యాశ్రయంబు నగుసంభాషణము భారతి యనఁబడును.

దీనికిఁ బ్రరోచన ముఖ్యాంగము. ౫

ప్రస్తుతార్థప్రశంసచే నాసక్తి గలిగించి చూపఱ నభిముఖులను గా నొనరించుట ప్రరోచన. ఇది భారతీవృత్తికి ముఖ్యాంగము.

ఇందులకు, రత్నావళిలో:—

"శ్రీహర్షుఁడా! నిపుణుఁడగు కవి. ఈపరిషత్తా! గుణగ్రాహిణి. కథయా! హృదయరంజక మగువత్సరాజచరితము" ఇత్యాదిక ముదాహరణము.

రంగప్రసాదనాద్యంబు వస్త్వాదిసూచనాంతంబు
ప్రస్తావన. ౬

రెండవ సూత్రధారుఁడు రంగస్థలంబును రంజింపఁ జేయుట మొదలుగా వస్త్వాదులలో నొకదానిని సూచించునంతవఱకును గలయది ప్రస్తావన యనఁబడు. దీనికే యాముఖ మని నామాంతరము గలదు. కొన్నిప్రాచీన రూపకంబులలో దీనికి స్థాపన యనుపేరు గూడఁ గనఁబడుచున్నది గాని యది లక్షణగ్రంథములలో మృగ్యము.

ఇది సూత్రధారమారిషాదికృత్యంబు. ౭

సూత్రధారుఁడు మారిషునితోఁ గాని నటితోఁ గాని విదూషకునితోఁ గాని ప్రస్తుతకథాసూచకంబుగాఁ దనకార్యమును గూర్చి చిత్రమైన సంభాషణ మొనరించుట యే ప్రస్తావనానామంబునఁ బరఁగును. ఇందు మారిషునకు మార్షుఁడు పారిపార్శ్వకుఁడు నని నామాంతరంబులు గలవు.

ప్రస్తావనాంగములు:—

కథోద్ఘాతాదు లంగములు. ౮

కథోద్ఘాతము ప్రవృత్తకము ప్రయోగాతిశయము అను నివి ప్రస్తావన కంగములు. ఇం దేదైన నొకటి యుండఁ దగును.



కథోద్ఘాతము:—

గీ. సూత్రధారునిపల్కులఁ జూడఁబడెడు
కథకుఁ బోలినవాక్యంబు గాని దాని
యర్థమును గాని కైకొని యంతఁ బాత్ర
మరుగుదెంచుట యుద్ఘాత మగును గథకు. ౯

ఇందులకురత్నావళిలో:- "ద్వీపాంతరమునుండి గాని" యనుసూత్రధారవాక్యమును గైకొని యౌగంధరాయణుఁడు ప్రవేశించుటయు, వేణీసంహారములో—"కురురాజసుతులు స్వస్థు లగుదురుగాక" యనుసూత్రధారవాక్యార్థమును గ్రహించి భీముడు ప్రవేశించుటయు నుదాహరణములు.

ప్రవృత్తకము:—

కాలసామ్యసూచితపాత్రప్రవేశము ప్రవృత్తకము. ౧౦

సూత్రధారుఁ డొనరించుఋతువర్ణనముచే సూచింపఁబడిన యాఋతుసమానధర్మములు గలపాత్రముయొక్క ప్రవేశము ప్రవృత్తక మనఁబడును. ఇందులకు రామచరితములో—"నిర్మల మయినచంద్రహాసమును బొంది యుగ్రమైన గాఢతపస్సు గలదశాస్యుని రాముఁడు నశింపఁ జేసినట్లు వర్షాకాలము నణంచి బంధుజీవనమును బోషించు శరత్సమయము వచ్చినది" అనుశరత్కాలవర్ణనముచే సూచింపఁబడినరామపాత్రప్రవేశ ముదాహరణము.

ప్రయోగాతిశయము:—

నిర్దిష్టపాత్రప్రవేశము ప్రయోగాతిశయము. ౧౧

ఈ, ఇది, ఇతఁడు, అని సూత్రధారునిచే నిర్దేశింపఁబడిన పాత్రప్రవేశము ప్రయోగాతిశయము.

ఉదాహ. "ఈదుష్యంతరాజువలెనే" ఇత్యాదికము.

వీథ్యంగము లాముఖాంగములు. ౧౨

ఉద్ఘాత్యము అవలగితము ప్రపంచము త్రిగతము ఛలనము వాక్కేళి అధిబలము గండము అవస్యందితము నాళిక అసత్ప్రలాపము వ్యాహారము

మృదవము అను నీపదుమూఁడు వీథ్యంగములును బ్రస్తావనాంగములుగాఁ గూడఁ బరిగణింపఁబడుచున్నవి. కాని యిందుఁ గొన్ని ప్రస్తావనలోని సూత్రధారాది పాత్రములచేతనే కాక తరువాతఁ బ్రవేశించిన కథానాయకాదిపాత్రములచేఁ గూడ నిర్వహింపఁబడినట్లు లక్ష్యంబులఁ గనఁబడుచున్నవి. ఇఁక వీనికి లక్షణంబులు యథాక్రమముగా నరయునది.

## ప్రశ్నోత్తరమాల యుద్ఘాత్యము. ౧౩

ఉక్తి ప్రత్యుక్తిరూపముగా నున్న యిరువుర సంభాషణ ముద్ఘాత్యమనఁబడును.

ఇందులకుఁ బాండవానందంబున.—

ఉ. ఏయది సద్గుణంబగు? సహించుట, యేది పరాభవంబగుఁ?
దాయలకీడు, దుఃఖ మెది? దాస్యము, సౌఖ్యమెు? శత్రునాశనం,
బేయది చావు? దుర్వ్యసన, మెయ్యదివంద్యము? మేలుసేఁత, యెవ
రా! యెవరి ట్లెఱింగిరి? విరాటుపురంబున నున్నపాండవుల్.

## ఉద్దిష్ట కార్యంబు నుపాయాంతరముచే నిర్వహించుట యవలగితము. ౧౪

దీని కుత్తరరామచరితంబున:—

వనవిహారరూపం బైనసీతయొక్క గర్భవాంఛ జనాపవాదమూలంబుగ నరణ్యంబున విడిచిపెట్టుటచే నిర్వహింపఁబడినది.

## అయుక్తం బగుపరస్పరస్తోత్రము ప్రపంచము. ౧౫

నవ్వు పుట్టించున ట్లిరువురు మృదుత్వము తప్పినరీతిని బొగడుకొనుట ప్రపంచము.

ఇందులకుఁ గర్పూరమంజరిలో:—

"రండ ధర్మపత్ని, మద్యమాంసములు, పానీయభోజ్యములు, చర్మఖండము శయ్య, ఇట్టికులధర్మ మెవనికి రమ్యము గాదు" అనుభైరవానందవచన ముదాహరణము



## శ్రుతిసామ్యంబున ననేకార్థయోజనంబై పూర్వరంగకార్యం బగునది త్రిగతము. ౧౬

వినవచ్చినశబ్దమును బోలికనుబట్టి పెక్కువిధములుగా గ్రహించుట త్రిగతమనఁబడు. నటాదిసంభాషణం బగు నిది పూర్వరంగమునందుండఁ దగును.

ఎట్లనఁగా:—"ఈవినఁబడునది మదించినతుమ్మెదలశబ్దమో ధీరం బగుకోకిలనాదమో కైలాసంబుననున్న కిన్నరస్త్రీలకలమధురాక్షరం బగు గానమో యగును." ఇత్యాదికము.

## వ్యాజస్తుతి ఛలనము. ౧౭

స్తుతివచనమువలెఁ గన్పడునిందావచనము ఛలనము.

ఇందులకు వేణీసంహారంబున:—

చ. అనుజుల కొజ్జ కర్ణునకు నాప్తుఁడు జూదపు నేర్పుకాఁడు నీ
తిని గనువాఁడు లక్కయిలు దీప్తికిఁ దెచ్చినవాఁడు ద్రౌపదిం
దనసభ గౌరవించినయుదారుఁడు పాండవనేత యాసుయో
ధను నరయంగ వచ్చితి మతం డెట నుండెనో తెల్పుఁడీ జనుల్

## వాక్యవినివర్తనము వాక్కేళి. ౧౮

అభిప్రాయము సమాప్తము కాకుండఁగనే మాట మార్చుట వాక్కేళి యనఁబడును.

ఇందుల కుత్తరరామచరితంబున:—

ఉ. నాకనుదోయివెన్నెలవు, నాబ్రతుకుంగడ వీవ, నీవ కా
నాకు ద్వితీయచిత్తమవు, నాయెడ లంటుసుధారసంబు నీ
వేకద యంచుఁ బెక్కు లగునిష్టపుఁబల్కుల బుజ్జగించి యా
యేకను ముద్దరాలి—నిఁక నెందుల కాపయిఁ జాలుఁ జెప్పఁగన్

## అన్యోన్యాధికోక్తి యధిబలము. ౧౯

అభిమానంబున నొకని మీఱి యొకఁడు గొప్ప చెప్పికొనుట యధిబల మనఁబడును. ఇందులకు వేణీసంహారంబున భీమదుర్యోధనులమాట లుదాహరణము.

### ప్రస్తుతసంబంధి భిన్నార్థంబునగు సాహసవచనము<br>గండము. ౨౦

ప్రకృతమునకు సంబంధించిన దయ్యు మఱియొక యర్థముఁ గల్పింపఁ జాలి యాకస్మికంబుగ వచ్చినమాట గండ మనఁబడును

ఉత్తరచరితంబున—రాముఁడు:—

ఈ ప్రియభాషిణిఱొమ్మమీఁద నపుడే నిద్రించినదా యేమి (చూచి)

చ. ఇదిగృహలక్ష్మి, నేత్రముల కియ్యది యమృతాంజనవర్తి, దీ
నిది యగుతాఁకు దేహమున నిర్మల చందనగంధలేపనం
బిది శిశిరంబు మౌక్తికసరేద్ధభుజంబు గళంబునందు, దీ
నిది సకలంబు సహ్యము వినింద్యవియోగ మొకం డసహ్యమౌ

ప్రతిహారి—(వచ్చి) దేవా! వచ్చెను వచ్చెను.

రాము—ఎవఁడు?

ప్రతీ—దేవరయాసన్నపరిచారకుఁ డగుదుర్ముఖుఁడు. (అని)

### రసోక్తంబున కన్యథావ్యాఖ్యాన మవస్యందితము. ౨౧

సరసంబుగఁ జెప్పఁబడినమాటకు మఱియొకవిధముగా వ్యాఖ్యానము చేయుట యవస్యందిత మనఁబడును.

ఉదాహరణము, ఛలితరామమున:—

సీత.—కుమారా! మీరిద్దఱు అయోధ్యకుఁ బోవుదురు గదా? అట్లయినఁ దత్పురాధీశునకు సవినయంబుగ నమస్కరింపుఁడు.

లవు:—అమ్మా! మేము రాజుల నాశ్రయించి జీవింపఁ దగినదా?

సీత:—మీరే కాదు. భూతలం బంతయు నట్లే.

### సోపహాసము నిగూఢార్థము నగు సంభాషణము<br>నాళిక. ౨౨

అర్థగాంభీర్యము గలనవ్వుటాలమాటలు నాళిక యనఁబడును.



ఎట్లనఁగా:—ముద్రారాక్షసంబున:—

శిష్యుఁడు:—ఛీ! మూర్ఖా! నీవు మాయుపాధ్యాయునికంటెను మిక్కిలి ధర్మము నెఱుంగుదువా!

చరుఁడు—కోపపడకయ్యా బాపఁడా! అందఱు నన్నియుఁ దెలిసినవారు కారు. మీగురువు నేదో కొంచె మెఱుఁగును. నావంటివాఁడుగూడ నేదో కొంచె మెఱుఁగును.

శిష్య—ఓరిమూఢుఁడా! మాయుపాధ్యాయునిసర్వజ్ఞత్వ మపహరించుచుంటివా!

చరు—అట్లయిన మీయొజ్జ చంద్రుఁ డెవని కిష్టుఁడు గాఁడో యెఱుఁగునా?

శిష్య—ఇది తెలిసిన నేమి? తెలియకున్న నేమి?

చాణక్యుఁడు—సరియే. చంద్రగుప్తునియెడ ననురక్తులు కానివారిని దా నెఱుఁగుదు నని వీఁడు తెలిపెను.

### అసంబద్ధభాషణ మసత్ప్రలాపము. ౨౩

నిద్రకు మదమునకు ఉన్మాదమునకు బాల్యమునకు నసంబద్ధప్రలాపము గూడ విభావ మగుటచే నిది యసంగతి యను వాక్యదోషము గానేరదు. ఉదాహరణము, ఉన్మాదమునకు—

గీ. అగ్గిలోఁ దాన మాడితి నాకసంబుఁ
ద్రాగితిని గొండ మెక్కితిఁ దనివి దీఱ
హరిహరాదులు నాపుత్రు లట్టు లగుట
నృత్య మొనరించుచుంటి నా కేమి కొదవ?

### హాస్యలోభకరం బన్యప్రయోజనంబు నగువచనము<br>వ్యాహారము. ౨౪

నవ్వును ఆసక్తిని బుట్టించునదై వేఱొక ప్రయోజనంబు గలిగిన మాట వ్యాహార మనఁబడు. ఎట్లనఁగా:—మాలవికాగ్నిమిత్రంబున లాస్యప్రయోగానంతరము మాలవిక వెళ్లఁ బోవుచున్నది.

విదూ—నీ వొకటి మఱచిపోయితివి దాని నుపదేశించెదను. [illegible]ము. (అని యుపక్రమించినపిదప)

గణదాసుఁడు—(విదూషకునిఁగూర్చి), ఆర్యా! నీ వేమైనఁ [illegible] గని పెట్టితి వేమో చెప్పుము.

విదూ—ముందుగా బ్రాహ్మణపూజ చేయఁదగినది. ఆమె యది మఱచి పోయినది. (అందఱు నవ్వుచున్నారు) దీనివలన నాయకున కింకను నాయికాదర్శనలాభము గలిగినది.

## గుణదోషవైపరీత్యము మృదవము. ౨౫

గుణము దోషము గాను దోషము గుణము గాను జెప్పఁబడుట మృదవ మనఁబడును. ఉదాహరణము.

గీ. అవయవవ్రాతము బలిష్ఠ మగును క్రొవ్వు
కరఁగిపోవును దేహంబుబరువు తగ్గుఁ
జిత్త ముప్పొంగు మతి వికసించుఁ గాన
వేఁట యాడుట మంచిదే వేయునేల.

## పాత్రసూచనాదుల్కు యథాక్రమకృత్యములు. ౨౬

పూర్వోక్తము లగుప్రస్తావనాంగములలో నేదైన నొకదానిచే సూత్రధారుఁ డర్థమును బాత్రమును సూచించుట, యంత నతఁడు నిష్క్రమించుట, పిదపఁ గథాప్రారంభము ననునివి క్రమముగా జరుగఁ దగును.

## రాజర్షిదివ్యులు నాయకులు. ౨౭

పూర్వోక్తధీరోదాత్తలక్షణలక్షితుఁడు ప్రఖ్యాతవంశుఁడు కీర్తికాముఁడు తేజస్వియు నగురాజర్షి గాని దివ్యుఁడు గాని నాటకంబున నాయకుఁడు కాఁదగును

## ప్రఖ్యాత మాధికారికము. ౨౮

పురాణప్రసిద్ధ మైనయితివృత్తమిందుఁబ్రధానకథగా నుండఁదగును.



## రసనాయకవిరుద్ధంబులు పరిత్యాజ్యంబులు. ౨౯

రసంబునకును నాయకధర్మంబులకును విరుద్ధంబు లగుకల్పనవర్ణనాదులు విడువఁదగును. లేదా, అట్టివాని నన్యథాకల్పనము గావింపఁ దగును.

ఎట్లనఁగా:—ఉదాత్తరాఘవంబునం దొకనెపంబున వాలివధ విడువఁబడినది. మహావీరచరితంబునందో, రావణునియందలి మైత్రిచే వాలి రాముని జంపవచ్చినట్లును, అంత రాముఁడు వాలిని జంపినట్లును మఱియొకవిధముగాఁ గల్పింపఁబడినది. ఇట్లే కావ్య మామూలాగ్ర ముచితపరిగ్రహంబును ననుచితపరిత్యాగంబు గలుగునట్లుగా సూచనీయ దర్శనీయ వస్తుజాతంబును బరిశుద్ధంబు గావింపవలయు.

## సంధ్యాదివిభజన మవశ్యకరణీయంబు. ౩౦

ప్రధానవృత్తంబునకుఁ దగినట్లుగా నారంభాదు లగుపంచావస్థలకనుగుణంబుగా బీజాదు లగునర్థప్రకృతు లైదును విభజింపఁదగును. మఱియు నయ్యాసంధి కనుగుణంబుగ నంగముల నెఱింగి ప్రయోగింపఁదగును. ఇట్లు సంధ్యంగవిభజన మొనరించినపిదప నంకవిష్కంభాదు లిట్లు కావింపఁదగును.

## అంకవిష్కంభంబులు కార్యనిఘ్నంబులు. ౩౧

ప్రదర్శనయోగ్యత ననుసరించి నాటకాదియందుఁ గార్యానుగుణంబుగా విష్కంభంబు గాని యంకము గాని రచింపనగును. అనఁగా నాదినుండియు సరసం బగువస్తువును బ్రదర్శించునెడ మొదలనే యంకంబును, లేదా, రసహీనం బగువస్తువిస్తరము పరిత్యజించి మిగిలినయపేక్షితవృత్తము ప్రదర్శించునెడ ముందుగా విష్కంభమును రచింపఁదగును. ఇది ప్రథమప్రకాశంబున నిర్వచింపఁబడినది.

ఇఁక, అంకము:—

## నానాప్రయోజన రసాశ్రయంబు బిందువ్యాప్తి పురస్కృతంబు నగుప్రత్యక్షనాయకచరిత మంక మనఁబడును. ౩౨

బహువిధము లైనప్రయోజనంబులు గలప్రధానరసంబున కాధారమై ప్రథమప్రకాశంబునఁ జెప్పఁబడినబిందువుతోఁగూడినదియు రంగస్థలంబునఁ

ప్రత్యక్షముగఁ జూపఁబడునదియు నగు నాయకునిచరిత మే యంక మనఁబడును.

### అంగిరసపోషణం బిందు సర్వథా ముఖ్య కర్తవ్యంబు. 33

అనుభావ విభావ వ్యభిచారిభావంబులచేతను రసాంతరస్థాయిచేతను గూడ నంకంబునఁ బ్రధానరసంబు పోషింపఁదగును.

### వస్తురసంబులు పరస్పర మవిరుద్ధంబులు గావలయు. ౩౪

ప్రధానకథకు విచ్ఛేదము గలుగునట్లు విశేషించి రసవర్ణనము గాని రసమునకు బాధ గలుగునట్లుగా విస్తరించి సంధ్యంగాములతోఁ గూడినవస్తు వర్ణనంబు గాని చేయఁదగవు.

### వీరశృంగారాన్యతరంబు ముఖ్యంబు. ౩౫

నాటకంబున వీరశృంగారములలో నేదైన నొకరసము ముఖ్యముగా నుండఁదగును. ఇట్లనుటచే నితరరసము లంగముగా నుండవచ్చు నని స్పష్టమగుచున్నది.

### అద్భుతంబు నిర్వహణయోగ్యంబు. ౩౬

విశేషించి నిర్వహణ సంధియందు నద్భుతరసంబు వర్ణింపఁదగును.

### సంగ్రామాదు లప్రదర్శనీయములు. ౩౭

యుద్ధము, దూరప్రయాణము, దూరాహ్వానము, మరణము, రాజ్యవిప్లవము, దేశోపద్రవము, బలాత్కారము, స్నానానులేపనభోజనములు, వస్త్రధారణాదులు, అను నివి ప్రవేశకాదులచే సూచింపఁదగును గాని యంకములచేఁ బ్రత్యక్షముగఁ బ్రదర్శింపఁ దగవు.

### నాయకవధము సర్వథా త్యాజ్యము. ౩౮

ప్రవేశకాదులచేఁ గూడ నాయకహింస సూచింపఁదగదు.



### ఆవశ్యక మవర్జనీయము. ౩౯

కైజమును ముఖ్యముగాఁ జెప్పఁదగినదియు నగు నంశ మేదియును విడువఁ దగదు.

### అంక మేకాహచరిత్రైకప్రయోజనం బాసన్ననాయకం బబహుపాత్రంబు గానోపు. ౪౦

అంకమునం దొక్కనాఁడు ప్రదర్శింపఁ దగినయొక్కప్రయోజనము వర్ణింపవలయును. అందలికథాంశమునకు నాయకుఁడు గాని నాయిక గాని సంబంధించి యుండవలయు. పాత్రములు మూఁడు గాని నాలుగు గాని యుండవలయు.

### అంకాంతనిర్గమంబు కర్తవ్యంబు. ౪౧

అంకంబుతుద నెల్లపాత్రములకు నిష్క్రమణంబు చెప్పవలయును.

### అంకంబు ప్రవేశకాది పురస్కృతంబు పతాకాస్థానకాంతంబు నై యొప్పు. ౪౨

అంకమున కాదియందుఁ బ్రవేశకవిష్కంభాములలో నేదైన నుండవలయును. రాఁబోవుకథను సూచించునట్టిపతాకాస్థానక మంతమం దుండవలయు. ఇవ్విధముగా నంకరచనలక్షణ మెఱుంగునది.

### ఆపంచాంక మాదశాంకము నాటకము. ౪౩

నాటకమున కయిదు మొదలుగాఁ బదివఱకు నంకము లుండవచ్చును. ఇది నాటకలక్షణము.

ప్రకరణము:—

### ప్రకరణం బుత్పాద్యవృత్తంబు శాంతనాయకంబు గాఁదగు. ౪౪

ప్రకరణరూపకంబున నితివృత్తము లోకసామాన్య మైనదియుఁ గవిబుద్ధివిరచిత మయినదియుఁ గావలయు. నాయకుఁడు ధీరశాంతు డైనయప్పు

త్యవిప్రవైశ్యులలో నెవ్వఁ డేని కాఁదగును. అతఁడు ధర్మార్థకామ తత్పరుఁడు గావలయును.

నాయిక త్రివిధ. ౪౫

ప్రకరణమందు నాయిక కులజ గాని వేశ్య గాని యుభయము గాని కాఁదగును. ఈనాయికలనుబట్టి ప్రకరణము మూఁడువిధము లగుచున్నది. కేవలకులజగలది పుష్పదూతికము లేక మాలతీమాధవము. కేవలవేశ్య గలది తరంగదత్తము. ఈయిరువురును గలది మృచ్ఛకటికము. ఇందు మృచ్ఛకటిక మువలెఁ గితవద్యూతకరాదిధూర్తసంకుల మైనది సంకీర్ణ మని చెప్పఁబడును

శేషము నాటకతుల్యము. ౪౬

విశేషవిహితంబుగ విధింపఁబడినదానికంటె మిగిలిన సంధిప్రవేశకరసాఙ్గాదికసామాన్యలక్షణంబు నాటకంబునకుం బోలెఁ బ్రకరణంబునకుం గూడ నెఱుంగునది.

భాణము :—

ఏకాంకంబు విటైకపాత్రవర్ణితకల్పితధూర్తచరితంబు
భారతీవృత్తికంబు భాణంబు. ౪౭

భాణంబున నొక్కటియే యంకము. ఇతివృత్తము కల్పితము. అది ధూర్తచరితముగా నుండవలయును. తాను గాని యితరులు గాని యనుభవించినదిగా నుండునట్టి యాధూర్తచరితమును సమర్థుఁడును విద్యావంతుఁడు నగువిటుఁ డనునొక్కపాత్రమే ప్రయోగింపవలయును. ఇందుఁ దఱచుగా భారతీవృత్తి యుపయోగింపఁదగును.

సంబోధనోక్తిప్రత్యుక్తు లాకాశభాషితంబులు. ౪౮

ఇం దితరులను బిలుచుట యడుగుట వినుట మొదలగునవి "ఓయీ, ఏమంటివి! ఇటంటివా?" యనునట్లాకాశవచనములచే జరుగఁ దగును.



సాంగముఖనిర్వహణములు లాస్యాంగములు
నుపయోజ్యంబులు. ౪౯

భాణమునందు సాంగముగా ముఖసంధియు నిర్వహణసంధియు లాస్యాంగములు నుపయోగింపఁదగును. * గేయము, పదము, స్థితము, పాఠ్యము, ఆసీనము, పుష్పగండిక, ద్విగూఢకము, త్రిగూఢకము, ఉత్తమోత్తమకము, ఉక్తప్రత్యుక్తము, అనునీపదియును లాస్యాంగములు.

వీరశృంగారములు శౌర్యసౌభాగ్య వర్ణనా
సూచనీయములు. ౫౦

ఇందు శౌర్యవర్ణనచే వీరరసము గాని సౌభాగ్యవర్ణనచే శృంగారరసముగాని సూచింపఁదగును.

ప్రహసనము:—

భాణతుల్యం బగుప్రహసనంబు త్రివిధంబు. ౫౧

ఇతివృత్తము, ఏకాంకము, ముఖనిర్వహణసంధులు, తదంగములు, లాస్యాంగములు మొదలగువాని నుపయోగించుటయందుఁ బ్రహసనము భాణముతో సమానము. ఇది శుద్ధము, వికృతము, సంకీర్ణము నని మూఁడు విధము లగుచున్నది. నవ్వుపుట్టించునది యగుటచే నిది ప్రహసనమనఁబడును.

అందు శుద్ధము:—

పాషండాదివ్యవహారము హాస్యకారివేషభాషాదికము
నగునది శుద్ధము. ౫౨

శాక్యులు నిర్గ్రంథులు జాతిమాత్రబ్రాహ్మణులు మొదలుగాఁ గల చేటీ చేట విటులయొక్క వ్యవహారముతోఁ గూడినదై నవ్వుపుట్టించునట్టి వారివేషభాషాచేష్టలతో నొప్పుచున్నది శుద్ధమనఁబడును. అనఁగాఁ

---

* ఈలాస్యాంగములు పదియు భరతనాట్యశాస్త్రమునఁ బ్రతిపాదింపఁబడినవి. దశరూపకంబున వీనినిర్వచనములు లేవు.

పాషండవిప్రాదు లైనవిటచేటులలో నెవ రైనఁ బ్రధాననాయకులుగా నుండఁదగుదురు. ఇందు హాస్యరసము ప్రధానము.

వికృతము:—

విపరీతవేషభాషాదికము వికృతము. ౫౩

కంచుకి షండ తాపస వృద్ధాదులు విట చార భటాదులవేషభాషలు గలిగినవారుగా వర్ణింపఁబడుటచే విపరీతధర్మము గలిగిన యిది వికృత మనఁబడుచున్నది.

సంకీర్ణము:—

వీథ్యంగసంకరము ధూర్తసంకులము సంకీర్ణము. ౫౪

ఇందు ముఖనిర్వహణ లాస్యాంగములే కాక పూర్వము చెప్పఁబడిన యుద్ఘాత్యకాదు లగువీథ్యంగములు గూడ నధికముగాఁ జూపఁ దగియుండుటచే సంకర మయి చోరకితవద్యూతకరాది ధూర్తులతోఁ గూడిన దగుటచే నిది సంకీర్ణ మని చెప్పఁబడుచున్నది. సర్వత్ర హాస్యరసమే విస్తరింపఁదగును.

డిమరూపకము:—

ఖ్యాతవృత్తంబు దేవాదిషోడశోద్ధతనాయకంబు చతు
స్సంధి చతురంకంబు సవృత్తిత్రయంబు రౌద్రరస
ప్రధానంబు డిమంబు. ౫౫

డిమసంఘాతమువలె నాయకసంఘాతవ్యాపారము గలది యగుటచే నిది డిమ మనఁబడుచున్నది. ఇం దితివృత్తము పురాణేతిహాసప్రసిద్ధ మైనది గావలయు. దేవకిన్నరగంధర్వయక్షరాక్షసభుజగభూతప్రేత పిశాచాదులు పదునాఱుగురు ధీరోద్ధతనాయకు లుండవలయు. అవమర్శసంధి గాక మిగిలిన ముఖాదిసంధులు నాలుఁగు, నాలుగే యంకములు, కైశికీవృత్తి గాక మిగిలినమూఁడువృత్తులును, ప్రధానంబుగ రౌద్రరసంబును విధింపఁ దగును. హాస్యశృంగారములు గాక మిగిలినరసము లంగములుగా నుండఁ



దగును. ఈరసములు మాయేంద్రజాల సంగ్రామ క్రోధాద్భుతాదిచేష్టలను దెల్పునవిగా నుండఁదగును.

ప్రస్తావనాదికము నాటకతుల్యము. ౫౬

మిగిలిన ప్రస్తావనాపాత్రప్రవేశాదినాట్యధర్మము నాటకంబునకుంబోలె డిమంబున కరయఁ దగును. సంస్కృతంబునఁగూడఁ ద్రిపురదాహ మనునొక్కడిమరూపక మున్నట్లు వినఁబడుచున్నది.

వ్యాయోగము:—

ఏకాంకంబు విఖ్యాతచరితంబు ధీరోద్ధతనరనాయకంబు
త్రిసంధికం బస్త్రీనిమిత్తసంగరంబు డిమతుల్యంబు
వ్యాయోగంబు. ౫౭

ఇందుఁ బెక్కండ్రు పురుషులు కూడుచున్నారు గావున నిది వ్యాయోగ మనఁబడు. ఇందొక్కటియే యంకము. ఇతివృత్తము పురాణాది ప్రసిద్ధము. ధీరోద్ధతు లయిన యనేకమానవులు నాయకులు. గర్భావమర్శములు గాక మిగిలినమూఁడు సంధులు, స్త్రీనిమిత్తముగాని యుద్ధమున నుండవలయు. డిమతుల్య మని చెప్పుటచే హాస్యశృంగారములు గాక మిగిలిన వీరాదు లాఱురసంబులును కైశికీవృత్తి గాక మిగిలిన మూఁడు వృత్తులును వర్ణింపఁ దగు నని తెలియుచున్నది. మిగిలిన ప్రస్తావనాదులు నాటకంబునకుం బోలె దీనికిఁగూడ నెఱుంగునది.

సమవాకారము:—

త్ర్యంకంబు ఖ్యాతవృత్తంబు దేవదానవ ద్వాదశనాయకంబు
వీరరసప్రధానం బనవమర్శంబు ప్రత్యంకకపట శృంగార
విద్రవం బష్టాదశనాడికాప్రమాణంబు కించిదూన
నాటకతుల్యంబు సమవాకారంబు. ౫౮

ఇందుఁ బ్రయోజనములు వేఱువేఱుగా వెదచల్లఁబడుచున్నవి గావున నిది సమవకార మగుచున్నది. ఇందు మూఁడే యంకములు. ఇతివృత్తము

సుప్రసిద్ధ మయినది. నాయకులు ప్రసిద్ధు లయిన దేవదానవులు పండ్రెండుగురు. వారికి వేఱువేఱుగా సముద్రమథనంబున వాసుదేవాదులవలెనే ప్రయోజనము లుండఁదగును. ఇందు వీరరసంబు ముఖ్యము. మిగిలిన యన్నిరసంబులు నంగములుగా నుండఁదగును. అవమర్శసంధి గాక మిగిలిన నాలుగుసంధులు నుపయోగింపవలయును. కపటము, శృంగారము, ఉపద్రవము ననునివి మూఁడును ప్రత్యంకము వర్ణింపఁదగును. వస్తుస్వభావముచేఁ గాని శత్రువశంబునఁ గాని దైవవశంబునఁ గాని సంభవించినవంచన కపటమనఁబడును. ధర్మార్థకామవర్ణనము శృంగారమనఁబడును. నగరోపరోధము యుద్ధము, అగ్నివాయ్వాదులచే సంభవించెడియుపద్రవమును విద్రవ మనఁబడు. మఱియు సమవకారమంతయుఁ బదునెనిమిదినాడులకాలము ప్రమాణము గలది గావలయు. * నాడి యనఁగా రెండుగడియలకాలము. అందుఁ బ్రథమాఙ్కము పండ్రెండునాడులు, ద్వితీయాఙ్కము నాలుగునాడులు తృతీయాఙ్కము రెండునాడులును బట్టునట్లుగా రచింపవలయు నని నాడీవిభాగ మెఱుంగునది. వీథ్యంగములు యథాలాభముగా రచింపఁదగును. బిందుప్రవేశకము లిందు విధింపఁ దగవనియుఁ బ్రస్తావనాదులు రచింపఁ దగునని యుఁ దుదివిశేషణంబున గ్రహించునది.

వీథి.—

భాణతుల్యంబు త్రయోదశాంగంబు సూచనీయశృం
గారం బేకద్విపాత్ర ప్రయోజ్యంబు వీథి. ౬౯

వీథివలె నిది యంగములకు మార్గ మగుచున్నది గాన వీథి యనఁబడును. ఇది భాణతుల్య మగుటచే నితివృత్తము కల్పిత మనియు నొక్కటియే యంక మనియు సాంగము లగుముఖనిర్వహణసంధులు లాస్యాంగములు నుపయోగింపఁ దగు ననియు నెఱుంగునది.

మఱియు నుద్ధాత్యకాదులగువీథ్యంగములు పదుమూఁడు నిందుపయోగింపఁ దగును. కైశికీవృత్తితోఁ గూడినశృంగారరసం బిందు ముఖ్యముగా

* నాడీలక్షణము నాట్యశాస్త్రమునుండి వ్రాయఁబడినది.



సూచింపఁదగును. రసాంతరంబులు గూడ నౌచిత్యమున కనుగుణంబుగా సూచింపఁదగును. ఇందొక్కటి గాని రెండు గాని పాత్రములు యథాసంభవముగా నుండవలయును.

అంకము:—

ఖ్యాతకల్పిత వృత్తంబు ప్రాకృతనరనాయకంబు కరుణరస
ముఖ్యంబు స్త్రీపరిదేవితబహులంబు వాగ్యుద్ధజయా
పజయంబు భాణతుల్యం బుత్సృష్టికాంకంబు. ౭౦

అంక మనఁగా నాటకాదులలోనిభాగ మగునంక మనికొందు రని రూపకలక్షణకర్తలు దీని నుత్సృష్టికాంక మని పేరు పెట్టిరి. *ఇం దితివృత్తము ప్రఖ్యాతమయినది గాని వికృత మయినది గాని కావచ్చును. ఇందు నాయకులు ప్రాకృతమనుష్యులు. కరుణరసము ప్రధానము. మిగిలిన వీరాదులు యథాసంభవముగ నుపయోజ్యములు. స్త్రీవిచారము తఱచుగా నుపయోగింపఁ దగును. యుద్ధము, అందలిజయాపజయములు వాఙ్మాత్రమున విధింపఁదగును. మిగిలినసంధులు వానియంగములు భారతీవృత్తి మొదలగునవి భాణమునకుం బోలె దీనికిని విధింపఁదగును.

ఈహామృగము :—

మిశ్రవృత్తంబు చతురంకంబు త్రిసంధికంబు ధీరోద్ధత
నరదివ్యనాయకప్రతినాయకంబు దివ్యస్త్రీబలాత్కా
రంబు తన్నిమిత్తకసంరంభంబు నివారితయు
ద్ధంబు వధహీనం బీహామృగంబు. ౭౧

మృగమువలె నలభ్య యగునాయికను నాయకుఁ డిందుఁ గోరుచుండుటచే నిది యీహామృగ మనఁబడుచున్నది ఇందు నితివృత్తము ప్రఖ్యాతకల్పిత మిశ్రము. అంకములు నాలుగు. గర్భావమర్శములు గాక మిగిలిన

* ఇది భరతాచార్యమతము. ప్రఖ్యాతవృత్తమునే స్వబుద్ధిచే వివరింపవలసిన దని ధనంజయుమతము.

డూఁడు సంధులు నుండఁదగును. ఇందు ధీరోద్ధతు లయినవరదివ్యులు నాయకప్రతినాయకులు గా నుండఁదగుదురు. అనఁగా నరుఁడు నాయకుఁడు దివ్యుఁడు ప్రతినాయకుఁడు గాఁ గాని లేక దివ్యుఁడు నాయకుఁడు నరుఁడు ప్రతినాయకుఁడు గాఁ గాని యుండవచ్చును. ఇందనురాగము లేనిదివ్యస్త్రీని బలాత్కరించుటయనునది ముఖ్యము. ఇది నిమిత్తముగా శృంగారాభాస మందందుఁ బ్రదర్శింపఁ దగు నని తెలియుచున్నది. నాయికానిమిత్తంబుగా నాయకప్రతినాయకులకు వైరము వర్ణింపఁదగును. కాని సంగ్రామము కారణాంతరకల్పనంబున నివారింపఁదగును. అయుక్తకారి యగుప్రతినాయకుఁడు చంపుటకు దొరకినను వధమాత్రము చేయఁదగదు. "స్త్రీరాగంబున నిందు శృంగారము ముఖ్యముగాఁదగినను బ్రతినాయకకారణంబున వీరాదులు గూడఁ బ్రధానాంగములు గాఁదగు నని యెఱుంగునది. మిగిలినవిషయంబులందు వ్యాయోగమునకుఁ బోలె దీనికిని లక్షణం బరయునది" యని భరతాచార్యమతము.

ఇఁక సంకీర్ణరూపకంబులలో నాటిక యొక్కటియే రచింపఁ దగు నను తలంపుతో భరతాచార్యుఁడును ధనంజయుఁడును గూడఁ బ్రకరణలక్షణసందర్భంబున వివరించిననాటికాలక్షణ మిట్లరయునది.

నాటిక:—

ఉత్పాద్యవృత్తంబు చతురంగంబు లలితనాయకంబు
శృంగార ప్రధానంబు నాటిక. ౬౨

ఇందితివృత్తము కల్పితము. నాలుగే యంకములు. ధీరలలితుఁడైన రాజు నాయకుఁడు. శృంగారరసంబు ముఖ్యము - దీనిచే సాంగంబగు కైశికీవృత్తి యిందుపయోగింపఁ దగు నని యెఱుంగునది.

దేవీప్రతిబంధాంతరితతాదృశముగ్ధనాయికానురాగంబు
తదంగీకృతనాయకసమాగమంబు నిందు
ముఖ్య వర్ణ్యములు. ౬౩

దేవి యనుటచే నాయకున కుత్తమనృపకులసంజాతయుఁ బ్రగల్భయు నగుజ్యేష్ఠభార్య గలిగి యుండవలయు ననియుఁ, దాదృశముగ్ధనాయిక య



నుటచే, నాయకుఁడు గోరుచున్న నాయిక యుత్తమరాజవంశసంభూత యగు కన్యకగా నుండఁ దగు ననియుఁ, దత్ప్రతిబంధాంతరితం బగుతదనురాగమనుటచే నాయిక యేదో యొకకారణంబున దేవి కాసన్నవర్తినియై యుండవలయు ననియు నక్కారణంబుననే దానియనురాగమున కెడ నెడ విఘ్నములు సంభవించుచున్నట్లుగా వర్ణింపఁ దగు ననియు నెఱుంగునది. మఱియుఁ దుదకు దేవిచే నాయికానాయకుల సమాగమ మంగీకరింపఁబడినట్లుగా వర్ణించుటయు ముఖ్యవిషయము. దీనింబట్టి యే స్త్రీప్రధానమయిన యీరూపకమునకు నాటికయను స్త్రీలింగనామ ముచిత మగుచున్నది. మిగిలిన సంధిప్రవేశక ప్రస్తావనాదులు ప్రకరణంబునకుం బోలె దీనికిఁ గూడ నరయునది.*

ఇఁక దశరూపకంబునఁ జెప్పఁబడక పోయినను, ఈ సందర్భమునఁ ద్రోటకము నాట్యరాసకము నను నుపరూపకంబులు రెంటికి నిం దధికముగా లక్షణము నిర్వచింపఁబడుచున్నది.

త్రోటకము:—

అనాటకంబు త్రోటకంబు. ౬౪

లక్షణంబున నాటకభిన్నమై నాటకసదృశమైనది త్రోటకము నాఁబడు. అనఁగా నయిదుగాని యేడుగాని యెనిమిదిగాని తొమ్మిది గాని యంకములు మాత్రమే యుండవలయు ననునియమంబునను, ప్రత్యంకము విదూషకుఁ డుండవలయు ననునియమంబున నీషద్భేదము నొందుచున్న త్రోటకము మిగిలినయెల్లలక్షణంబుల నాటకంబును బోలుచున్నది. ప్రత్యంకవిదూషకం బనుటచే నిందు శృంగారము ప్రధానమని యెఱుంగునది. వీరహాస్యాదు లంగములు. మఱియుఁ బైవిశేషణంబు ప్రాయికాభిప్రాయంబు

---

* ఈనాటికాలక్షణ మెందఱెన్ని నాటికలు రచియించిన నొక్కవిధముగానే యుండఁదగినట్లుగానున్నది. కాని కొన్నిప్రాచీననాటికలయందీ లక్షణము సరిగా సమన్వయింపదు.

గాన నే దైన నొకయంకములో విదూషకుఁడు లేకున్నను దోషము గాదు. ఏతాదృశం బగుత్రోటకమునకు విక్రమోర్వశీయమే యుదాహరణము.

నాట్యరాసకము:—

> ఉత్పాద్యవృత్తం బేకాఙ్కం బుదాత్తనాయకంబు వాసక
> సజ్జికాపీఠమర్దనాయికాసహాయంబు సహాస్యశృంగా
> రంబు భాణతుల్యంబు నాట్యరాసకంబు. ౬౭

ఇం దితివృత్తము కల్పితము. ఒక్కటియే యంకము. ధీరోదాత్తుఁడు నాయకుఁడు. వాసకసజ్జ నాయిక. పీఠమర్దుఁడు నాయకసహాయుఁడు. శృంగారరసము ప్రధానము. హాస్యరస మంగము. మిగిలినసంధిప్రస్తావనాలాస్యాంగములు భాణంబునకుం బోలె దీనికిని విధింపనగును.

ఇది ఆంధ్రదశరూపకం బనుదృశ్యకావ్యశాసనంబున
రూపకప్రకాశ మనుతృతీయప్రకరణము.

---

శ్రీరస్తు.

# ఆంధ్రదశరూపకము.

## చతుర్థప్రకరణము.

---

### రసప్రకాశము.

రూపకలక్షణానంతర మిఁక రసభేదము ప్రతిపాదింపఁబడుచున్నది.

రససామాన్యలక్షణము :—

> గీ. బహువిధవిభావముఖ్యభావములచేతఁ
> బ్రబలి యాస్వాదగోచరత్వమును జెందు
> నట్టిరతిహాసశోకభయాది యైన
> స్థాయిభావము రస మని తలఁపఁబడును. ౧

వక్ష్యమాణలక్షణంబులు ననేకవిధంబులు నగువిభావానుభావసాత్త్వికవ్యభిచారిభావంబులచేఁ బ్రకటింపఁబడినదై యాస్వాదయోగ్యతను జెందునట్టిరత్యాదిరూప మైనస్థాయిభావము రసము. చూచువారియొక్కయు వినువారియొక్కయు హృదయంబుల నంటి యున్నరతిహాసాదికము స్థాయి యనఁబడును. ఈ రసంబుననే సామాజికులకు రసికులనియుఁ గావ్యమునకు రసవంత మనియు వ్యవహారము గలుగుచున్నది.

విభావము:—

> భావపోషకం బగువిభావము ద్వివిధము. ౨

విశేషంబుగ రతిహాసాదులను గలిగించునది విభావ మని చెప్పఁబడును. అనఁగా:—ఇతఁ డిట్టివాఁడు, ఇది యిట్టిది యని కావ్యంబుల విశేష

విహితంబుగ వర్ణింపఁ బడినయభిమతం బగునాయికానాయకదేశకాలాదికమే విభావ మనియెఱుంగునది. ఇది రసంబునకుఁ గారణ మగుచున్నది. స్థాయిభావమును బోషించు నిది యాలంబనము, ఉద్దీపనము నని రెండు విధము లగుచున్నది. శృంగారంబున నాయికానాయకులు, రౌద్రంబున శత్రువు, భయానకంబున శార్దూలాదికమును, ఆలంబనము. ఉద్యానమలయానిలచంద్రాదిక ముద్దీపనము. ఇట్లే యూహించుకొనునది. ఇం దాలంబనవిభావమునకు విక్రమోర్వశీయంబున—

ఉ. మారశరాకరంబు మధుమాసమొ కాంతు లొసంగురాజొ శృం
గారరసాకరుం డయినకంతుఁడొ దీని సృజించెఁ గాక సం
సారసుఖానభీష్టమతి ఛాందసుఁ డైనపురాణతాపసుం
డీరుచిరాంగసౌష్ఠవము నె ట్లొనరింప సమర్థుఁ డయ్యెడిన్?

ఉద్దీపనవిభావమునకు:—

గీ. మృదులశీతలధవళచంద్రిక నొసంగి
వెండితీఁగలఁ గేరుచునుండుతనదు
కరము లనుతమిస్రతూండ్లపంజరమునందు
జగము విలసిల్ల నుదయించెఁ జందురుండు.

## భావసంసూచకం బగువికార మనుభావము. ౩

సామాజికులకు రతిహాసాదిస్థాయిభావములను జ్ఞప్తికిఁ దెచ్చుకటాక్షభుజాక్షేపాదికం బగువికార మనుభావము. ఇది రసమునకుఁ గార్యము గాఁదగును గాని భావసంసూచకం బగువికార మనుట లౌకికరసంబు నుద్దేశించిన దగుటచే ననుభావము గూడ నిందు రసమును బోషింపఁ గారణమే యగు నని యెఱుంగునది. కావున, రసమునకుఁ గారణకార్యంబు లగునీరెండును సమానధర్మము లగుటచే వీనికి వేఱువేఱుగా లక్షణం బనుపయోగ మని కొందఱ మతము.



అనుభావమునకు మదీయప్రతిజ్ఞాశాంతనవమున.

చ. తలుకును భావగర్భితపుఁబల్కులు, భావజగర్భితంపుఁజూ
పులఁ బఱపున్ గటాక్షములపోఁడిమి, భావము భావజుండు లోఁ
గలచియునవ్వు నవ్వఁ, దమి గల్గినచిహ్నము లిట్లు దోఁప నీ
తలఁపు ఫలంబు గాంచక వృథా చను నే యెటుఁగింపు నిన్నుఁ గన్.

## భావము సత్త్వజనితం బగుట సాత్త్వికంబు నాఁబడు. ౪

రామాదినాయకులసుఖదుఃఖాదులను గావ్యంబులఁ జదివి యనుభవించుటచేఁ గాని నటులయందుఁ బ్రత్యక్షముగఁ జూచి యనుభవించుటచేఁ గాని పైకి వచ్చినవాసనా(సంస్కార)రూపం బగు సామాజికులమనోవికారము భావ మని చెప్పఁబడును. “రసములను దెలియఁ జేయునది గాని కవిహృదయగతాభిప్రాయంబుఁ దెలియఁ జేయునది గాని భావ మని చెప్పఁబడును” అను లక్షణంబు గావ్యంబునందు నభినయంబునందును వర్తించుభావశబ్దమునకు గతి కల్పించుట కని యెఱుంగునది. పూర్వోక్తభావమే సత్త్వమువలనఁ బుట్టిన దగుటచే సాత్త్వికభావ మనఁబడుచున్నది. ఇతరులసుఖదుఃఖములను భావించుటయందు మిక్కిలి యనుకూలముగా నున్నయంతఃకరణవృత్తి సత్త్వ మనఁబడు. ఇది మనస్సు నిశ్చలముగా నుండుటవలన జనించును. ఖేదము వచ్చినపుడు కన్నీరును, మోదము వచ్చినపుడు గగుర్పాటును గలుగుటయే సమాహితచిత్తతయొక్క సత్త్వము. దీనివలనఁ బుట్టినవి సాత్త్వికములు. అవియే భావములు. వానివలన జనించిన వగుటచే స్వేదాశ్రురోమాంచాదులు గూడ భావము లగుచున్నవి. ఇవి రతిహాసాదులను జ్ఞప్తికిఁ దెచ్చునవి యగుటచే ననుభావంబు లని కూడఁ జెప్పఁబడును.

## స్తంభాదులు సాత్త్వికభావములు. ౫

స్తంభము రోమాంచము ప్రలయము స్వేదము వైవర్ణ్యము కంపము అశ్రువు వైస్వర్యము అను నెనిమిదియు సాత్త్వికభావములు. స్తంభ మనఁ

గా నిశ్చేష్టముగా నుండుట. ప్రళయ మనఁగా స్మృతి తప్పుట. వైస్వర్య మనఁగా గద్గదస్వరము పడుట. ఇతరము స్పష్టము, సాత్త్వికభావములకు.

ఉ. కంపము పుట్టె, మేనఁ బులకల్ వొడమెన్, మొగముం జెమర్చె, బా
ష్పంపుఁగణంబులుం దొఱఁగెఁ, బల్కులకున్ దడపుట్టె, మాటెర
మ్యంపుశరీరశోభ, మెయి ప్రమాన్పడెఁ, జెల్వి యొకింత దప్పె, న
చ్చంపకగంధి, కింకఁ బయి జాగొనరింపక పొమ్ము మిత్రమా !.

## నిర్వేదాదులు వ్యభిచారిభావములు. ౬

సముద్రంబునఁ దరంగంబులు పుట్టుచు నణఁగుచు నున్నట్లే రత్యాదికం బగుస్థాయియందుఁ బుట్టుచు నణఁగుచు సంచరించుచున్నచిత్తవికార రూపంబు లగునిర్వేదాదులే వ్యభిచారిభావములని చెప్పఁబడును. నిర్వేదము గ్లాని శంక శ్రమము ధృతి జడత్వము హర్షము దైన్యము ఉగ్రత్వము చింత త్రాసము ఈర్ష్య అమర్షము గర్వము స్మృతి మరణము మదము సుప్తము నిద్ర విబోధము వ్రీడ అపస్మారము మోహము మతి అలసత్వము ఆవేగము తర్కము అవహిత్థ వ్యాధి ఉన్మాదము ఉత్సుకత్వము చాపలము విషాదము అను నీముప్పదిమూఁడును వ్యభిచారిభావములు.

## స్వనింద నిర్వేదము. ౭

అభిమతము నెఱవేఱక పోవుట, దుఃఖము, తత్త్వజ్ఞానము మొదలగు వానివలనఁ దన్నుఁ దా నిందించికొనుట నిర్వేదము. ఇందు విచారము కన్నీరు నిట్టూర్పు మొదలగునవి జనించును. శృంగారనిర్వేదమునకు మదీయ ప్రతిజ్ఞాశాంతనవమున.

ఉ. అక్కట! వెఱ్ఱిబుద్ధి మెయి నందనిపండ్లకు నఱ్ఱు సాఁచిన
ట్లక్కురువీరుఁ గోరి హృదయార్తికిఁ జిక్కితి మారుబారికిం
దక్కితిఁ గాక కల్గునొకొ తక్కువనోములు నోఁచినట్టినా
కెక్కువలాభ మింక సుఖ మేదినయాత్రము కేల యీడ్వఁగన్!.



ఇట్లే విభావానుభావరసాంగానంగభేదంబున ననేకవిధం బగునిర్వేదము నెల్లరసంబులందు ను సందర్భోచితంబుగ నూహించుకొనునది.

## బలహీనత గ్లాని. ౮

రతిశోకాదులవలని యాయాసము దప్పిక ఆఁకలి మొదలగువాని వలనఁ గలుగు బలహైన్యము గ్లాని యనఁబడును. ఇందు రూపుమాయుట వణఁకు అనుత్సాహము మొదలగునవి జనించును. కరుణగ్లానికి మదీయోత్తరరామచరితంబున.

తమస—ఇదిగో సీత గోదావరీప్రవాహమునుండి బయలువెడలి—

గీ. చిక్కి కడుఁ దెల్లవడినట్టిచెక్కు లలరు
వదనమందు శిరోజముల్ చెదరి పడఁగఁ
గరుణరసమూర్తియో మేను గలవియోగ
బాధయో యన నడవికి వచ్చుచుండె.

శేషము నిర్వేదమునకు వలెనే యూహించుకొనునది.

## అనర్థప్రతిభ శంక. ౯

పరక్రౌర్యమునఁ గాని స్వదుర్నయము చేఁ గాని యనిష్టము నూహించుట శంక. ఇందు విచార కంప వర్ణస్వరవ్యత్యయాదులు జనించును. స్వదుర్నయశంకకు మదీయ వీరచరితమున—

గీ. తాటకను జంపి హింసించి తాటకేయు
నెవఁడు గిరిఁ బోలుమారీచు నెగురఁ గొట్టె
గడ్డిపోఁచగఁ గడుదవ్వు, ఘనుఁడు రాజ
పుత్త్రుఁ డాతండు నామనంబును దహించు.

ఇట్లే యితర మూహ్యము.

## ఖేదము శ్రమము. ౧౦

యానంబునఁ గాని రత్యాదికంబునఁ గాని కలుగునాయాసము శ్రమ మనఁబడు. ఇందు స్వేదము మర్దనము మొదలగునవి కలుగును.

మార్గాయాసమునకు మదీయోత్తరచరిత్రంబున:—
రాముఁడు—దేవీ! యెట్లొ మఱచి పోవుదును!
మ. గమనాయాసముచేత మందమృదులాకారప్రముగ్ధంబులై
తమకంబున్ బిగి గల్గుకౌఁగిలులచేతన్ దత్తసంవాహసౌ
ఖ్యములై మ్లానమృణాళదుర్బలములై కన్పట్టుతన్వంగముల్
తమి నాయొమ్మునఁ జేర్చి నీ వెచట నిద్రం బొంది తావో టిదే.

## సంతోషము ధృతి. ౧౧

జ్ఞానముచేఁ గాని శక్తిచేఁ గాని కలుగుసౌఖ్యకరం బగుసంతోషము ధృతి యనంబడు.
జ్ఞానధృతికి భర్తృహరిశతకంబున.—
చ. సిరిఁ గని నీవు సంతసముఁ జెందుచునుంటివి మేము వల్కలాం
బరములఁ బొంగుచుంటిమి సమానమె మోదము నీకు మాకు డె
ప్పరముగ నెవ్వఁ డాసపడు వాఁడు దరిద్రుఁడు గాని తృప్తిచేఁ
బరఁగినచో మనంబు ధనవంతుఁ డెవండు దరిద్రుఁ డెవ్వఁడో?

## అప్రతిపత్తి జడత. ౧౨

ఇష్టదర్శనంబునను, అనిష్టశ్రవణంబునను గలిగిన యవిశ్వాసము లేక యజ్ఞానము జడత్వము. ఇందు ఱెప్పపాటు లేనిచూపు ఊరకయుండుట ఉపేక్ష మొదలగునవి జనించును.
అనిష్ట శ్రవణంబున కుదాత్తరాఘవమున.—
రాక్షసుఁడు—ఖరదూషణ త్రిశిరులు నాయకులుగాఁ గలయీమహాసై
న్యము నెవఁడు సంహరించెను?
ద్వితీయుఁడు—ధనుర్ధరుం డగురామహతకుఁడు.
ప్రథముఁడు—ఒక్కఁడే చంపెనా?
ద్వితీ—చూడక యెవఁడు నమ్మును? ఒక్కసారి యీ రణాంగణంబు చూ
డుము. ఇత్యాదులు.



## ప్రసత్తి హర్షము. ౧౩

ప్రియజనదర్శనము పుత్రజననము మొదలగువానివలన జనించుచిత్తప్రసాదము హర్ష మనఁబడు. ఇం దానందబాష్పస్వేదాదులు జనించును.
పుత్రాలింగనహర్షమునకు మదీయోత్తరచరితంబున.—
గీ. కమలకుట్మలగర్భపత్రములఁ బోలి
మాంసలము మసృణము సుకుమార మగుచుఁ
జందనముఁ జందురునిఁ బోలుచలువ గలుగు
నీదు కౌఁగిలి సుఖమును నెరపు నాకు.

## నిరుత్సాహత దైన్యము. ౧౪

లేమి అవమానము మొదలగువానివలనఁ గలుగు మనోవేదనము దైన్య మనఁబడును. ఇందుఁ గృశించుట మాలిన్యము మొదలైనవి జనించును. ఇందులకుఁ జాటువు.—
ఉ. బాలుఁడు తెల్పకుండె సుఖవార్తయు, మంచము పట్టె నంధకన్
గాలము దీఱుటన్ మగఁడు, గాలికిఁ గూలెను గొంప, మేఘముల్
గ్రాలుచునుండె నింగి, నొకకా సయినం గనరాదు, నిండుచూ
లాలయి యుండెఁ గోడ, లెటు లయ్యెడునం చొకకాంత చింతిలున్.

## చండత్వ ముగ్రత్వము. ౧౫

అపరాధము క్రౌర్యము దుస్స్వభావము మొదలగువానివలనఁ గలుగు చెడ్డతన ముగ్రత్వ మనఁబడు. ఇందు స్వేద శిరఃకంప తర్జన తాడనాదులు జనించును. ఇందులకు మదీయవీరచరితమున.—
చ. ఇరువదియొక్కసారి యొకఁడే మగపుర్వు మిగుల్చకుండ భూ
వరుల వధించి కొల్వ లగువారలరక్తమునన్ మునింగి యా
దరమునఁ దర్పణం బొసఁగి తండ్రికిఁ, గోపము డించినట్టినా
చరితము బాహువీర్యమును శౌర్య మెఱుంగవె సర్వభూమిపుల్!.

## తదేకధ్యానము చింత. ౧౬

కోరినవస్తువు లభింపకపోవుటచే దానికై యొక్కరీతిగానే తలంచుచుండుట చింత యనఁబడును. ఇందుఁ బరితాపశూన్యతాశ్వాసాదులు జనించును. ఇందుల కుదాహరణము.—

చ. అరయఁగ నాణిముత్తెముల నాజికిఁ బిల్చెడియశ్రుబిందు లి
య్యురమున హారభూషణత నొందఁగ బాలమృణాళనాళసుం
దరవలయాతిరమ్యకరతామరసంబున మోముఁ జేర్చి యో
సరసిజనేత్ర! యేమహితజన్ముఁ దలంచుచు నుంటివే మదిన్?

## చిత్తక్షోభము త్రాసము. ౧౭

అకస్మికభయజనకంబు లగుగర్జితాదులచేఁ గలుగు మనోవైకల్యము త్రాసము. ఇం దుత్కంపాదులు జనించును. ఇందులకు మాఘంబున.—

గీ. కాలికిని జేఁప తగులఁగాఁ గాతరమున
నులికిపడి నీరు వెడలె నియ్యువిద యహహ!
కారణము లేక యతిభీతిఁ గాంతు రబల
లే మనఁగ వచ్చుఁ దగి నంత హేతు వున్న?

## పరోత్కర్షాసహన మసూయ. ౧౮

ఇతరుల శ్రేయస్సును జూచి యోర్వలేమి యసూయ. ఇందు దోషోక్తి క్రోధము అవజ్ఞ మొదలగునవి జనించును. ఇందులకు మదీయవీరచరితంబున.—

చ. కనుఁగొన మాట పోవుటయె కాని ఫలంబు గనం డతండు భూ
తనయను బెండ్లియాడెను మదంబున దుశ్చరితుండు రాముఁ డ
మ్మనుజునకున్ లభించుపరమానినితోడియశంబు మానఘున్
దనయవమానమున్ దలఁచి తా దశకంధరుఁ డెట్టు లోర్చెడిన్!



## స్థిరకోప మమర్షము. ౧౯

ఇతరు లొనరించినపరాభవాదులచే జనించి స్థిరపడి యున్నకోప మమర్ష మనఁబడును. ఇందు స్వేదశిరఃకంపతర్జనాదులు పుట్టును. ఇందులకు మదీయవీరచరితంబున.—

గీ. పరమపావన మైనమీపలుకు వినని
పాపమున కొక్కనిష్కృతిఁ బడయువాఁడఁ
గాని వినువంగఁ జాల నిక్కాలమందు
సచ్చరితులార! నాదుశస్త్రవ్రతంబు.

## అభిజనాదిమదము గర్వము. ౨౦

సద్వంశజననము సౌందర్యము సంపద మొదలగువానిచేఁ గలిగినమదమే గర్వము. ఇం దవజ్ఞ ద్వేషము మొదలైనవి జనించును. ఇందులకు, మదీయమహావీరచరితంబున.—

గీ. మానియో వీరుఁడో యెవ్వఁడైన నేమి?
రాచదానవు వణఁ కేల? రఘుకులంబు
వాఁడ నే నీతపఃకీర్తి బాహుదర్ప
గర్వితుని సత్కరింపఁగఁ గడఁగువాఁడ.

## అనుభూతవిషయవిజ్ఞానము స్మృతి. ౨౧

పోలికచేఁ గాని విచారముచేఁ గాని మిత్రాదిదర్శనంబునఁ గాని తా ననుభవించినవిషయము జ్ఞప్తికి వచ్చుటయే స్మృతి. ఎట్లనఁగా:—మదీయోత్తరచరితంబున.—

జనకుఁడు:—హా! కష్టము కష్టము! ఈమెయే కౌసల్య.

చ. ఇరువురు వేఱుగాఁ బతియు నీసతియుం దమగుప్తభాషణా
దరకలహంబు నొండొరుల తప్పును జెప్పుమనంద్రు నాకు నా
యిరువురకిన్ని యేని మద మేని పదంపడి సాయధీన మా
స్మరణము చాలఁజాలు మది నుండుచు నుండెను దానిఁ దల్పఁగన్.

## మరణ ముద్యోగమాత్రనిబంధనీయము. ౨౨

అశుభప్రదమగుటచే మరణభావము ప్రధానపాత్రములకుఁ గల్పించుట యనుచితము గావునఁ దత్ప్రయత్నము సూచించినఁ జాలును. ఎట్లనఁగా :— మదీయప్రతిజ్ఞాకౌండిన్యంబున :—

చ. మనసున కెక్కినట్టి నవమన్మథుఁ డాసలమేర జీవనం
బునకు నిదాన మైనకురుభూవరుకూర్మికి దూర మైనవా
మనుగడ గాంచుభాగ్య మవమానము గాక మఱేమి కల్గుఁ గా
వున నిఁక నీరొ నిప్పొ సుఖప్రాప్తికి మార్గము గాఁగఁ జూచెదన్.

ఇఁకనో దుష్టసంహారఫలంబు లగురామాయణాదులయందుఁ దాటకారావణాదిమరణము యథేచ్ఛముగా వర్ణింపఁదగును.

## మదిరాదికృతం బగుహర్షోత్కర్షము మదము. ౨౩

మద్యపానాదులచేఁ గలిగినసంతోషాతిశయము మద మనఁబడును. ఇందు మాటలతడఁబాటు ప్రేలుట తూలునడక మొదలయినవి జనించును.

## నిద్రాసముద్రేకము సుప్తి. ౨౪

ఉచ్ఛ్వాసనిశ్వాసములు మాత్ర మిం దుండును.

## మనస్సమ్మీలనము నిద్ర. ౨౫

చింతాలస్యశ్రమాదులచే మనసు నిమీలన మగుటయే నిద్ర. ఇందావులింత ఒడలువిఱుపు పలవరింత మొద లగునవి జనించును.

## చేతనావాప్తి విబోధము. ౨౬

మేలుకొనుటయే విబోధము. ఆవులింత కన్నులు నలుపుట మొదలగునవి దీనిగుణములు.

## మనస్సంకోచము వ్రీడ. ౨౭

నూతనానురాగము స్తోత్రము దుష్ప్రవర్తనము హీనదశ మొద లగువానిచే నిది జనించును. అవయవములను ముఱుఁగుపఱుచుకొనుట మొగము వంచుకొనుట తెలతెలపోవుట హీనస్వరముతో మాటలాడుట మొద లగునవి దీనిచేష్టలు. ఇందులకు మదీయసత్యకీర్తిలో.

గీ. ఎదుర గాఁ బల్క సిగ్గుచే బెదరుఁ గాని
నాదుపల్కులు విని చిఱునవ్వు నవ్వు
నన్నుఁ గన్నారఁ గాఁ జూడ కున్న దీని
దృష్టి నాపటమే కన నిష్టపడును.

## ఆవేశ మపస్మారము. ౨౮

గ్రహము దుఃఖము మొద లగువానిచే జనించి శరీరమును దపింపఁ జేయు నావేశ మపస్మార మనఁబడును. క్రిందఁ బడిపోవుట వణఁకు చెమట నురుగుగ్రక్కుట మొద లయినవి దీనిచేష్టలు.

## విచిత్తత మోహము. ౨౯

భీతిదుఃఖావేశాదులచే మనసు చెడి యుండుట మోహము. అజ్ఞానము భ్రాంతి కలఁత మొదలగునవి దీనిగుణములు. దీనికి మదీయోత్తరచరితమున—

మ. తరుణీ! యేమిది దుఃఖమో సుఖమొ నిద్రాసౌఖ్యమో మోహమో
గరళవ్యాపనమో మదంబొ యెఱుఁగంగా రాదు నీ దైనయీ
పరిరంభంబున నింద్రియంబులను వే బంధించు హృద్భ్రాంతి యాం
తరచైతన్యము సంచలింప ముద మంకం జేయు నా కియ్యెడన్.

## తత్త్వనిశ్చయము మతి. ౩౦

సదుపదేశంబునను శాస్త్రాధ్యయనంబువలనను నిజ మయిన యర్థము నెఱింగి నిశ్చయించుటయే మతి. ఇందులకుఁ గిరాతార్జునీయమున:—

గీ. కోరి తొందరపడి చేయఁ గూడ దెట్టి
పనియు నవివేక మెల్ల యాపదల కిల్లు
తగ విమర్శించి చేయుశాలిని దమంత
ధన్యగుణలుబ్ధ లగుసంపదలు వరించు.

### శ్రమాదిజం బగుమాంద్య మాలస్యము. ౩౧.

శ్రమ గర్భభారము నిర్వ్యాపారత్వము మొదలుగాఁ గలవానివలన జనించు ప్రాలుమాలుదనము మాంద్య మనఁబడును. విసుగు అవులింత యూర కుండుట మొద లైనవి దీనిగుణములు. ఇందుల కుదాహరణము:—

గీ. గర్భభరమున నలస యాకంబుకంఠి
యింత నడయాడ నొల్ల దెన్నని యడుగ
నెట్టులో పలుక నొక్కమా టెంతసేపు
నూరక యె కూర్చుండుట కుత్సహించు.

### సంభ్రమ మావేగము. ౩౨

అనిష్టదర్శనశ్రవణాదులవలనఁ గాని రాజవిద్రవాదులవలనఁ గాని యగ్నివాతాతప వర్షాదులభయంటువలనఁ గాని దుష్టమృగాదిదర్శనంబునఁ గాని యిష్టప్రాప్తిచేఁ గాని జనించునట్టి సంభ్రమ మావేగ మనఁబడును. భయ స్తంభకంపాదులు దీనిగుణములు.

ఇం దిష్టప్రాప్తికి మదీయవీరచరితంబున:—

గీ. రామ రఘువంశసోమ! రారమ్మ రమ్మ!
మూర్ధమున ముద్దు గొనియెద ముదముతోడఁ
గౌఁగిలించెద మది నిన్నుఁ గట్టికొనెదఁ
గాక మ్రొక్కెద నీపాదకమలములకు.

### ససంశయాలోచనము తర్కము. ౩౩

సందేహముచేఁ బెక్కువిధముల నూహించుట తర్కము. కనుబొమ లాడించుట తల యూఁపుట మొద లైనవి దీనిగుణములు.

ఇందుల కుదాహరణము. రాముఁడు:—

గీ. భరతులో భింబొ కైకచాపలమొ కాక
యింతపని పుటుటకు హేతు వేమి? యకట!



యనుఁగుఁదమ్ముఁ డతం డామె యనుఁగుఁదల్లి
వారి నన రాదు దైవ మేర్పఱిచె నిట్లు.

### వికారగోపన మవహిత్థ. ౩౪

లజ్జాదులచే హర్షాదివికారములను గప్పిపుచ్చుట యవహిత్థ యనఁబడును. ఇందులకుఁ గుమారసంభవమున.—

గీ. తండ్రిచాటున నిల్చి యొంటయును బ్రీతి
నమరమునిపల్కులను వీను లార వినియు
గిరిజ తలవంచికొని లీలఁ గేలఁగొను జ
లేజమందలి ఱేకులు లెక్కపెట్టె.

### సన్నిపాతాదికము వ్యాధి. ౩౫

సన్నిపాతజ్వరాదు లగురోగములకు వ్యాధి యని పేరు. వానికిం దుఁ బ్రసక్తి లేదు గాన విప్రయోగాదులవలన జనించు సంతాపమే యిందు వ్యాధి యని గ్రహింపఁ దగును.

### చిత్తవిభ్రమ మున్మాదము. ౩౬

విరహసన్నిపాతాదులచేఁ గలుగు చిత్తభ్రాంతియే యున్మాదము. ఇందుఁ బాడుట యేడ్చుట నవ్వుట ప్రేలుట మొద లైనవి జనించును.

విరహోన్మాదమునకు మదీయసత్యకీర్తిలో:—

గీ. ఓయశోకమహీజమా! యీయడవిని
భవ్యమృదునవ్యరక్తాబ్జపాదయైన
నాసతీమణిఁ గంటివే నాకుఁ దెల్పి
నన్న శోకునిఁ గాఁ జేసి పున్నె మొందు.

### ఉత్సాహభంగము విషాదము. ౩౭.

తలఁచినపని కాకపోవుటచే నుత్సాహ ముడుగుటయే విషాదము. ఇం దుచ్ఛ్వాసనిశ్వాసాదు లుదయించును.

ఇందులకు మదీయవీరచరితంబున-రాక్షసుఁడు.—అకటా! తాటకా! నీట నానపకాయలు మునుఁగుచు తాలు తేలుచు నున్నవి.

గీ. నేఁడె దశముఖుతేజంబు నెలవుదప్పెఁ
గుఱ్ఱమానిసి యొనరించె గొప్పకీడు
బంధుజనహింస నాకంటఁ బడెను సత్త్వ
హీనుఁడను బెద్దవాఁడ నిందేమి దిక్కు?

## కాలాక్షమత్వ మౌత్సుక్యము. ౩౮

తనకోరిక యెప్పుడు నెఱవేఱు నని కాలయాపనము సహింపకుండు టయే యౌత్సుక్యము. ఇందు విభ్రమస్వేద హృదయతాపాదులు జనించును. ఇందులకుఁ గుమారసంభవమున.—

గీ. అద్దమునఁ జూచికొని తనయంగశోభ
నాత్రపడుచుండెఁ బార్వతి హరునిఁ జేరఁ
గాంతసింగారమునకుఁ జక్కనిఫలంబు
కాంతుఁ డనురక్తిఁ గన్గొనఁ గనుట గాదె?

## అనవస్థితి చాపలము. ౩౯

రాగద్వేష మాత్సర్యాదులవలనఁ గలుగు నస్థైర్యమే చాపలము. ఇందు భర్త్సనపారుష్యస్వచ్ఛందాచరణాదులు జనించును. ఇందుల కుత్తరరామచరితంబున.—

(తెరలో) ఓరీ చపలా! ఆమహారాజున కెదురురాఁ డెక్కడ? గలవు.—ఛీ! ఛీ! పోనిమ్ము.

గీ. ఉండిరే నుండుదురు గాక యుర్విలోన
భీతి నా కేమి గల్గు నీవిషయమందు?
నిట్టిపలుకులతో నేమి! యిపుడు మీప
తాక హరియింపుఁ జూతుఁడు తప్పకుండ.



స్థాయిలక్షణము:—

గీ. తనకు ననుకూలములు లేక యననుకూల
ములు నయినభావముల మార్పుఁ బొంద కెల్ల
వాని నెయ్యది తనదుభావమునఁ జేర్చు?
నయ్యదియె స్థాయి యనెడుభావాంబురాశి. ౪౦

పలువిధంబు లగురుచులును రూపంబులును గలబహుజలప్రవాహంబులు తనలోఁ బ్రవేశించుచున్నను వానిచే నించుకయు మార్పు నొందక సముద్ర మెట్లు తనధర్మంబులు వానికొసంగునో యట్లే తనతో సంబంధము గల సజాతీయ విజాతీయభావములచేఁ దాను మార్పు నొందక వానిం దనలో నిమిడ్చికొనుచు స్థిరముగా నుండుప్రధానభావము స్థాయి యని చెప్పఁబడును. ఎట్లనఁగా బృహత్కథలో నరవాహనదత్తునకు మదనమంజూషయందుఁ గలిగిన ప్రధానానురాగ మెడనెడ సంభవించిన యితరనాయికలయందలి యనురాగముచే నణఁగి పోక స్థాయి యగుచున్నది. మఱియు మాలతీమాధవంబున శృంగారము ప్రధానరసము. దానికి స్థాయి భావము రతి. అది మహాశ్మశానదర్శనాదిజన్యం బగుబీభత్సరసముచే బాధింపఁబడక స్థాయియగుచున్నది. ఇట్లే వీరకరుణాదులు ప్రధానరసము లయినప్పుడు వానిభావము లయిన యుత్సాహశోకాదులు రతిహాసాదు లయిన యితరభావములచే బాధింపఁబడక స్థాయు లగుచున్నవి.

## రత్యుత్సాహాదులు స్థాయులు. ౪౧

రతి ఉత్సాహము జుగుప్స క్రోధము హాసము స్మయము భయము శోకము అను నివి స్థాయిభావము లనఁబడును.

## శమము రూపకయోగ్యము గాదు. ౪౨

కొందఱు శాంత మను నొకరసము గల దని చెప్పుచు దానికి శమము స్థాయిభావ మని చెప్పిరి. మఱికొందఱు శాంతరసమే లే దనిరి. ఇఁకఁ

కొందఱు వీరబీభత్సాదులయం దిది యంతర్భూత మనిరి. ఎట్లయిన నేమి? సకల వ్యాపారవిలయరూప మైనశమ మభినయించుటకుఁ దగదు గావున నిది రూపకంబుల సర్వథా నిషేధింపఁబడిన దని యెఱుంగునది. కావున నెనిమిదియే స్థాయిభావములు. ఆస్వాదనయోగ్యము లగుటచే నిర్వేదాదులుగూడ స్థాయిభావము లగు నని కొందఱు తలంచిరి. కాని యనుకూల ప్రతికూలము లయిన యితరభావములచే మార్పు పొందకుండుట నిర్వేదాదులకు సంభవింపదు గావున వానికి స్థాయిత్వము లేదు. దీనింబట్టి రసత్వమును లేదు.

రసవిచారము:—

## అస్థాయియే రసము. ౪౩

అరతిహాసాదిక మైనస్థాయిభావమే రసము. కావ్యంబుల వర్ణింపఁబడెడి యిది రామాదులయవస్థల ననుకరించువారియం దుండినట్లు కనఁబడును గాని యది సత్యము గాదు. నిజముగా నయ్యాయవస్థలను జూచి యానందించుచున్న చూపఱయం దే యుండును. కావుననే సామాజికులకు రసికులని వ్యవహారము గలుగుచున్నది. ఇదియుం గాక కవులు రామాదులకథలను వర్ణించుట సహృదయులను సంతోషపెట్టుటకుఁ గాని యాకృత్రిమరామాదుల కానందము గలిగించుటకుఁ గాదు. ఒకవేళ నాటకాదుల యభినయంబున రామాదివేషధారి యగునటునియందు శృంగారము కనఁబడెనేని యట్టివానిని జూచినపుడు ప్రేక్షకులకు భార్యతోఁ గూడినసామాన్య లౌకికునిఁ జూచినట్లుగా "వీఁడు శృంగారవంతుఁ" డనెడి జ్ఞానము గలుగును గాని రసాస్వాదము గలుగ నేరదు. పైగా సత్పురుషు లగువారికి లజ్జాసూయాదులు గూడ జనించును. దీనిచే రసాదులకు వ్యంగ్యత్వమే పోవును. "సరియే కాని రసము సామాజికులయందే యుండునదేని యపు డాలంబనవిభావ మేది యగును. సీతాదిమహాపతివ్రతలు విభావ మగుట విరుద్ధము గాదని యెట్లు చెప్పనగును" అని సంశయము గలిగినచో నిట్లెఱుంగునది. కవీశ్వరులు సర్వలోకసాధారణముగాఁ గనఁబడుచున్న ధీరోదాత్తాదుల యవస్థలకు



రామాదుల నాశ్రయముగాఁ గల్పించిరి గాని నిజముగా యోగీశ్వరులవలె ధ్యాననేత్రమున ధ్యానించి నిశ్చయముగా రామాదుల చరిత్రము నితిహాసముగా రచించి రని తలఁపవలదు. అట్టియెడ విభావాలంబనము లయిన సీతాదులు గూడ జనకచక్రవర్త్యాదుల తనయలు గాక లోకసామాన్యస్త్రీలే యగుదురు. అట్టిచో హాని యేమి? "అట్లయిన నిట్టివిభావము గ్రహించుటలో నేమిప్రయోజన" మని మరల సందేహము గలిగెనేని యిట్లరయునది. మంటిరేనుఁగులతోను లక్కగుఱ్ఱములతోను నాడుకొనుచున్న బాలురకు వలెనే రాముఁడు అర్జునుఁడు సీత ద్రౌపది యనునామములతో నున్నవటులను జూచుటచేఁ జూపఱకుఁ దమ మనంబులయందలి యానందమే యాస్వాదగోచర మగును. ఇంతియే కాని లౌకికశృంగారమందువలెనే యిందుఁ గూడఁ గాంతలయుపయోగ మున్న దని యెఱుంగఁ దగదు. అట్లయినచో నాట్యరసము లౌకికరసముకంటె విలక్షణ మయినదా? అవును. నాట్యసమయంబునఁ దనకాంతతోఁ గూడినవాఁడు కాక పోవుటచే నర్తకుఁడు గూడ లౌకికరసముచే రసవంతుఁడు గాఁడు. కావ్యార్థమును దెలిసికొనుటచేత నందుమా? అట్లయినచోఁ బ్రేక్షకుల మయినమన కెట్లో వానికి నట్లే కావ్యరసాస్వాద మంగీకరింపఁ దగినదే.

కావ్యార్థపరిజ్ఞానంబునఁ బైకిఁ బొంగునట్టి యాత్మానందరసముయొక్క యనుభవమే కావ్యరసాస్వాదము. ఇది శృంగారమున వికాసము, వీరమున విస్తరము, బీభత్సంబున క్షోభము, రౌద్రంబున విక్షేపము, అను భేదములఁ గలిగి యుండును. ఇట్లే యిది హాస్యము, అద్భుతము, భయానకము, కరుణము, అను రసంబులఁ గూడఁ గ్రమముగాఁ బైభేదములచే నొప్పును. కావుననే హాస్యమునకు శృంగారము, అద్భుతమునకు వీరము, భయానకమునకు బీభత్సము, కరుణమునకు రౌద్రమును హేతువు లగు నని యాలంకారికు లంగీకరించిరి. సరియే కాని సంతోషజనకము లయిన శృంగారాదులయం దానందము పుట్టునట్లుగా దుఃఖజనకము లయినకరుణాదులయం దానంద ముదయించునా? నిజమే. కాని యీయానందము సుఖదుఃఖాత్మక

ము యినది. అదియుం గాక కావ్యములయందలి కరుణము లౌకికమైనకరుణము కంటె వే ఱయినది. కావున నిందుఁ గూడ నానంద మునయించు ననియే నమ్మఁ దగును. ఇందులకుఁ గరుణ రసాత్మకము లయిన రామాయణాదిప్ర బంధములు సామాజికుల కానందదాయకము లగుటయే నిదర్శనము.

## విభావాదిభావితస్థాయిభావము రసము. ౪౪

రసవిచారానంతరము మరల రసస్వరూప మిట్లు నిర్ణయింపఁబడుచు న్నది. కావ్యముల వర్ణింపఁబడిన చంద్రానిలోద్యానాద్యుద్దీపన విభావముల చేతను వనితాద్యాలంబనవిభావములచేతను నిర్వేదాదివ్యభిచారి భావంబులచే తను రోమాంచ భ్రూవిక్షేప కటాక్షాద్యనుభావములచేతను బోషింపఁబడి నదై భావరూపత్వమును జెందుస్థాయిభావమే రస మని యింతవఱకును జె ప్పఁబడిన ప్రకరణమందలి తాత్పర్యము. ఇఁక విశేషలక్షణముల ని ట్లెఱుం గునది. భరతాచార్యులు శృంగారాది రసములకును రత్యాదిస్థాయిభావముల కును వేఱువేఱుగా లక్షణములు నిర్వచించిరి కాని యిందు రసభావముల కభేదముగా లక్షణము నిర్వచింపఁబడును. అందు:—

శృంగారము:—

## రతియే శృంగారము. ౪౫

రమ్యము లయినదేశము కాలము వేషము ఉపభోగము మధురాం గవిచేష్టితము, అను నివి మొదలుగా ననేకవిధంబగు విభావము కారణముగాఁ బరస్పరానురక్తు లగుయౌవనవంతుల యానందాత్మకమైన సుఖానుభవమే రతి. అదియే శృంగారము.

అందు దేశవిభావమున కుత్తరరామచరితంబున:—

మ. మన మాకొండ వసించి యుండ బహుసమ్మానంబునన్ లక్ష్మణుం
డును సేవించిన యాశుభాహముల నందున్ స్వాదునీరంబు గ
ల్గినగోదావరి దానితీరపులినాళిన్ వేడ్కతోఁ జేయువ
ర్తనముల్ నీవు తలంచుచుంటివె? లతాతన్వంగి యోప్రేయసీ!.



కలావిభావంబునకు మదీయప్రతిజ్ఞాశాంతనవమున:—

చ. కనుఁగవ హృద్గతం బగువికారము దెల్పుచు నూత్నశోభ నా
ననమునఁ గూర్చుచుండె నిపుణంబుగఁ గూర్మిని వెల్లడించుభా
షణమును భావపోషణము సల్పుచునుండె నిఁ కెట్లు భావమున్
మనమున నిండి పైకొనిన మాటకు మాఱుగ మాట సెప్పుదున్?

మధురాంగవిచేష్టితమునకు సత్యకీర్తినాటికలో:—

చ. చిదిమినమల్లెపూ లెడమచేత నిముడ్చుచు జాఱుమన్నప
య్యెద సవరించి కొంగు బిగియించి విదిల్చి యణంచి కుచ్చెలల్
చెదరినముంగురుల్ సరిగఁ జేర్చుచు సన్నని నవ్వుకాంతితోఁ
బొదవినయోరచూపు లొకపూరము గా నను జూచెఁ బ్రీతితో.

## ఏకోనపంచాశద్భేదంబు లేతత్పోషకంబులు. ౪౬

పూర్వోక్తము లయినయెనిమిదిసాత్త్వికభావములు నెనిమిదిస్థాయి భావములు ముప్పదిమూఁడు వ్యభిచారిభావంబులును గలిసి నలువదితొమ్మిది భావంబు లీశృంగారమును బోషించును. ఇం దాలస్యమరణజుగుప్సాదులు విరుద్ధములు గా వని మున్నే చెప్పఁబడినది.

శృంగారవిభాగము:—

## అయోగాదిభేదంబున నిది త్రివిధము. ౪౭

ఈశృంగారము, అయోగము విప్రయోగము సంభోగము, ననుభే దంబుల మూఁడు విధంబు లగుచున్నది. అయోగవిప్రయోగములయందలి భేదము తెల్పుటకై యీరెంటికిని సామాన్యవాచక మగువిప్రలంభపద ముప యోగింపఁబడలేదు.

## అసంయోగ మయోగము. ౪౮

స్త్రీపురుషు లిరువురకుఁ బరస్పరము మనస్సులలో ననురాగ మంటి యున్నను బరాధీనతచేఁ గాని దైవవశమునఁ గాని వారికి సమాగమము సంభ వింపక పోవుట యయోగము. ఇందులకు సాగరికావత్సరాజులయొక్కయు

మాలతీమాధవులయొక్కయు గౌరీశంకరులయొక్కయుఁ బ్రథమవృత్తాంత ముదాహరణము.

## అయ్యాది దశావస్థము. ౭౯

అయోగశృంగారము, అభిలాషము చింతనము స్మృతి గుణకథనము ఉద్వేగము ప్రలాపము ఉన్మాదము సంజ్వరము జడత్వము మరణము ననెడి పదియవస్థలం గలిగియుండు.

అభిలాషమునకు శాకుంతలమున:—

గీ. తప్పు కిది రాజుపెండ్లాడఁ దగినకన్నె
కానిచోఁ గోరునే నాదుఘనమనంబు
సంశయాస్పదవస్తు విచక్షణమునఁ
జిత్తవృత్తి ప్రమాణ మౌ సుత్తములకు.

గుణకథనంబునకు మదీయప్రతిజ్ఞాశాంతనవమున—

ఉ. ఉత్తమరాజు కన్నది వయోగుణరూపవచోవిలాససం
పత్తిని గన్నచిన్న దభిమానకుమారిక యాచు దాశభూ
భృత్తునియింట నున్న దలవేఁటకుఁ బోయిననాకు దానిపైఁ
జిత్తము నాటికొన్నది-యిసీ! పలుమాటలు సెప్ప నేటికిక్?

ప్రలాపంబున కందే:—

సత్యవతి-ఏమే చెలీ? నాపలుకులు కలవరింత లటే.

ఉ. కోరినవాఁడు నిక్క మగుకూరిమి చెల్పినవాఁడు నన్ను దే
వేరిగఁ గైకొనంగఁ దలపెట్టినవాఁడు మహావిభుత్వల
క్ష్మీరమణుండు కన్నులకుఁ జెన్నగు నవ్వుమొగంబు వాఁడు నా
భారతరాజు నెయ్యమునఁ బల్కుచు నింతకు నిందు లేఁడొకో!.

ఇట్లే యితరావస్థల కూహించుకొనునది.

విప్రయోగశృంగారము:—



## వియోగము విప్రయోగము. ౮౦

రూఢానురాగము గలస్త్రీపురుషులకుఁ గలిగినయెడఁబాటు విప్రయోగము.

## ఇది ద్వివిధము. ౮౧

మానము ప్రవాసము ననుభేదంబుల నిది రెండువిధము లగు చున్నది.

## మానము ద్వివిధము. ౮౨

ప్రణయమానము, ఈర్ష్యామానము నని. ప్రేమపూర్వక మైనవశీకరణము ప్రణయము. దానిభంగమే మానము. అది నాయికానాయకుల కిరువురకును గలుగును. అందు-నాయకప్రణయమానవిప్రయోగమునకు మదీయోత్తరచరితంబున.—వాసంతి:—(సకరుణముగా) దేవా!

ఉ. ఈపాదరింటియందె వసియించితి వాసఖిరాకఁ గోరు చీ
వాపెయు గౌతమీపులినమందలియంచల వేడ్కఁజాలసే
పోపికఁ జూచి యంత నెటులో యిట వచ్చుచు నిన్నుఁ జూచిదు
ష్కుపునిమాడ్కి భీతి నొసఁగున్ నళినీముకుళోపమాంజలిక్.

## నాయికాకోప మీర్ష్యామానము. ౮౩

నాయకుఁ డన్యకాంతాసంగి యైనట్లు విని కాని చూచికాని యనుమానించికాని నాయిక కోపగించుట యీర్ష్యామానము. నాయకుఁడు దీనిని బోఁగొట్టుటకు మంచిమాటలు చెప్పుట దాని చెలికత్తెలను వశపఱచుకొనుట యాభరణాదులొసంగుట పాదములపైఁ బడుట మొద లగునవి యుపాయము లగును. ఇందుల కుదాహరణంబులు పూర్వరూపకంబులఁ బ్రసిద్ధములు.

ప్రవాసవిప్రయోగము:—

## కార్యసంభ్రమశాపమూలకం బగు భిన్నదేశస్థితి ప్రవాసము. ౮౪

కార్యవశమునఁ గాని సంభ్రమమునఁ గాని శాపముచేఁగాని నాయికానాయకులు వేఱువేఱుదేశంబులపా లగుట ప్రవాసవిప్రయోగ మనఁబడు.

తీర్థయాత్రా రాజసేవాదికము కార్యము. ఈకార్యప్రవాసము సర్వసామాన్యము. ఇఁక దైవికరాజకంబులవలనఁగాని బుద్ధిపూర్వకముగాఁ గాని సంభవించినయెడఁబాటు సంభ్రమప్రవాసము. ఇందుల కూర్వశీ పురూరవస్సులయు మాలతీమాధవులయు విప్రయోగము లుదాహరణము. మఱియు లోకాపవాదజన్యం బగుప్రవాసమునకు. మదీయోత్తరచరితంబున—రాముఁడు:—

ఉ. సీత గృహంబునందు నివసించుట గిట్టక పోయె మీకు, నా
హేతున గడ్డిపోఁచవలెనే వని వీడితి, వెన్కఁ గంత లే
చేతటి మీకు, భావముల వెల్ల ద్రవింపఁగఁ జేయు నన్ను, మీ
రీతఱిఁ జల్లగా మసలుఁడీ విలపింతుము మే మరక్షతన్.

ఇఁక రాజగురుదేవతాదుల కఠిన శాసనము శాపము. ఈశాపవిప్రయోగంబునకు మేఘదూతకావ్యమున యక్షునియుదంతమును గాదంబరిలో వైశంపాయనుని వృత్తాంతము నుదాహరణములు.

సంభోగశృంగారము:—

అనుకూలనాయకుల యన్యోన్యసుఖానుభవము
సంభోగము. ౫౫

అనురక్తులు విలాసవంతులు నగునాయికానాయకులు పరస్పర మనుభవించు దర్శన స్పర్శనాది సౌఖ్యమే సంభోగశృంగారము.

ఇందుల కుత్తరరామచరితంబున :—

ఉ. చెక్కిళు లాడుచుండ నెడఁ జెందక మిక్కిలి మెల్లమెల్లగా
మక్కువ మీఱఁగాఁ గ్రమము మాఱఁగ నేదెదో చెప్పికొంచు నొ
క్కొక్కభుజంబు గల్పి మన మూడనికౌఁగిట నుండ రాత్రియే
గ్రక్కునఁ బోయెఁగాఁ దెలియరాక గతించినజాము లొప్పఁగన్.

ఈశృంగారంబున నాయికకుఁ బ్రియునిఁ గూర్చి నాయకప్రకాశమునఁ జెప్పఁబడిన లీలాదిచేష్టలును, నాయకునకు నాయికం గూర్చి కలాక్రీడాదులు నను రూపంబులై వర్ణింపఁదగును. కాని గ్రామ్య మగుసంభోగమమాత్రము వర్ణింపఁదగదు. ఇది సర్వథానిషిద్ధము. లక్షణోక్తము సత్కవి



పరంపరావగతము నౌచిత్యభాజనము నగుశృంగారమును సుకవియగువాఁడు ప్రయోగింపఁదగు నని సర్వలాక్షణికమతము.

వీరరసము:—

ప్రతాపాదివిభావితము కరుణాద్యనుభావితము గర్వాది
భావితము నగునుత్సాహము వీరము. ౫౬

ప్రతాపము వినయము అధ్యవసాయము సత్త్వము మోహము అవిషాదము నయము విస్మయము విక్రమము మొదలగువిభావములచే నుద్భవించి,దయ యుద్ధము దానము నను ననుభావములచే మూఁడు తెఱఁగులై, గర్వము ధైర్యము హర్షము అమర్షము మతి స్మృతి వితర్కము మొద లగు వానిచే భావింపఁబడు నుత్సాహ మనెడిస్థాయియే వీరరసము. ఇందు దయావీరమునకు నాగానందమున జీమూతవాహనునియొక్కయు, యుద్ధవీరమునకు వీరచరితంబున శ్రీరామాదులయొక్కయు దానవీరమునకు బలి పరశురామాదులయొక్కయుఁ జరతము లుదాహరణములు.

యుద్ధవీరమునకు మదీయ వీరచరితంబున:—

ఉ. రాముఁడు రావణాసురుఁడు రావణి లక్ష్మణుఁడోజ ద్వంద్వసం
గ్రామమునన్ భుజాబలము గార్ముకశిక్షయు వన్నెకెక్కఁగాఁ
దాము పరస్పరంబు శరధాటికి నడ్డొనరించికొంచు ని
ర్ధూమలయాగ్ని మీఱుబలుతూపుల సేనల ముంచి రెల్లెడన్.

బీభత్సరసము:—

అనిష్టవస్తువిభావజనితజుగుప్స బీభత్సము. ౫౭

మిక్కిలి రోఁత పుట్టించుదుర్గంధాస్థిమాంసరుధిరాదులను జూచుటచేఁ గలిగిన జుగుప్స యనెడిస్థాయియే బీభత్సరసము. నారీస్తననాభీజఘనాదులను జూచుటయందలి వైరాగ్యముచేఁ గలుగుజుగుప్సయు బీభత్సమని తలఁపఁబడును. ఇందులకు మహావీరచరితంబున :—

లక్ష్మణుఁడు:—మునీంద్రా! ఇదియెవతె? ప్రేగులకుఁగ్రుచ్చి భూషణంబులుగా ధరించిన పుర్రెలదండలచప్పుడుచే నాకాశము పగులఁగొట్టుచుఁ ద్రాగి మరలఁ గ్రక్కిన నెత్తురసహ్యాకరముగా మేనెల్ల నిండ భీకరరూపంబున నిటు పరుగెత్తుకొని వచ్చుచున్నది!

విశ్వా:—ఇదియే సుందునిభార్యయు, సుబాహు మారీచులతల్లియు నగు తాటక.

రౌద్రరసము:—

మాత్సర్యశత్రుచేష్టాదిజనితక్రోధము రౌద్రము. ౫౮

స్పష్టము. ఇందులకు వీరచరితంబున—పరశురాముఁడు.

గీ. నూతనబ్రహ్మతేజంబునూఁత గొనెదొ?
జాతిమర్యాదఁ జాపంబుఁ జేతఁ గొనెదొ?
నాతపంబున దహియింతు నీతపంబు
నాదుగొడ్డంట నీవిల్లు నఱకువాఁడ.

హాస్యరసము:—

స్వపరవికృతవేషభాషాదిజనితహాసము హాస్యము. ౫౯

తనయొక్కకాని యితరులయొక్కకాని స్వభావవిరుద్ధమైన వేషము రూపము సంభాషణము మొద లగువానిచే నుదయించు హాస మనెడిస్థాయియే హాస్యరస మనఁబడు. ఈహాస్యమే కన్నులు వికసించునట్లు నవ్వినచో స్మిత మనియుఁ, బండ్లు కొంచెము గనఁబడునట్లు నవ్వినచో హసిత మనియు, మధుర మైనకంఠధ్వని గలుగునట్లు నవ్వినచో విహసిత మనియుఁ దల కదలునట్లు నవ్వినచో నుపహసిత మనియుఁ గన్నుల నీరు కాఱునట్లు నవ్వినచో నపహసిత మనియు నొడ లంతయుఁ గదలునట్లు నవ్వినచో నతిహసిత మనియు నాఱు విధములఁ జెప్పఁబడును.

పరస్థహాస్యమునకుఁ జాటువు.

మ. యతివర్యా! పలలాశనంబు దగునే? యౌరా! సురల్ వీడితే?
హితమా మద్యము గూడ నీకు? బళిరా! యిష్టంబ వేశ్యాళిసంగతియుక్, దానికి ద్రవ్య మేది? యది చక్కంబెట్టు జూదంబొ చోరతయో, వీని నెఱుంగుదా క్కా! మఱి సర్వభ్రష్టు దిక్కే మగుల్?



అద్భుతరసము:—

అతిలోకపదార్థవర్ణనోదితవిస్మయ మద్భుతము. ౬౦

లోకాతీత మైనపదార్థముల వర్ణించుటచేఁ గలిగినవిస్మయస్థాయియే యద్భుతరసము. ఇందులకు మదీయవీరచరితంబున:—

ఉ. చేతులఁ బట్టి ముక్కలుగఁ జేసినశంభునివింటిమ్రోఁత రా
మాతిచరిత్రముం దెలుప నంతట డిండిమనాదమై మహా
భీతి నెలంగ దిక్కుల గుభిల్లనఁ జేయుచు విశ్వభాండమం
దాతతచండిమంబు నయి యాఁగ దిఁకైన నిదేమి చిత్రమో!

భయానకరసము:—

వికృతస్వరసత్త్వాదిజనితభయము భయానకము. ౬౧

భయంకర మైనధ్వని వినుటచేఁ గాని దుష్టజంతువులఁ జూచుటచేఁ గాని భీకరరూపమును జూచుటచేఁ గాని కలుగుభయ మనెడిస్థాయియే భయానకరసము. ఇందుఁ గంప సంభ్రమ మోహాదులు పుట్టును.

ఇందుల కుత్తరరామచరితంబున.—

లక్ష్మ:—దేవీ! ఇతఁడే భగవంతుఁ డగుభార్గవుఁడు.

సీత:—(సభయముగా) లక్ష్మణా! ఇతనిఁ జూచిన వణఁకు పుట్టుచున్నది.

కరుణ రసము:—

ఇష్టనాశనానిష్టప్రాప్తిజనితశోకము కరుణము. ౬౨

ప్రియవస్తుబంధువినాశన విప్రయోగాదులవలనఁ గాని యప్రియ మగు బంధనాదికము గలుగుటవలనఁగాని జనించుశోక మనెడిస్థాయియే కరుణరసము. ఇం దుచ్ఛ్వాసనిశ్వాసస్తంభప్రలాపాదిభావములు పుట్టును.

ఇందులకు మదీయోత్తరచరితంబున:—

రాముడు:—అంతఃకరణము నెంత యణఁచి పెట్టుచున్నను దుఃఖ మాఁగకున్నది.

చ. తెగఁబడి హద్దుమీఱి చను డెంచెడుశోకరసంబు వేగ మా
పఁగ నెది యెద్ది యత్న మగుఁబట్టున? దానిని దాని నాఁపరా
నిగతిరయంబు గల్గుజలనిర్ఝర మానికతామయంపుసే
తుగతిని జీల్చి చీల్చి పయి దోఁచెడుఁజిత్తవికార మేదియో.

## ప్రీతిభక్త్యాదులు హర్షాద్యంతర్భూతంబులు. ౬౩.

ప్రీతిభక్త్యాది భావంబులును మృగయాక్షాదిరసంబులును హర్షోత్సాహాదులయం దంతర్భూతము లగుటచే వేఱుగా వివరింపఁ బడలేదు.

## సత్కవిప్రతిభానుభావితము సరసము. ౬౪.

రమ్యమైనదిగాని యసహ్యాకరమైనదిగాని, ఉదారమైనదిగాని నీచమైనదిగాని, ప్రసన్నమయినదిగాని భయంకరమయినదిగాని యెట్టిదియైనను వస్తుజాతము సత్కవులప్రజ్ఞావిశేషంబునఁ బ్రకాశింపఁ బడినదయ్యేనేని సరసమై మనోహరముగానే యుండును. అనఁగా నేకథయైనను సరసస్థితికిఁ దెచ్చుట కవులప్రతిభను బట్టి యున్నదని యెఱుంగునది.

సీ. వేంకటగిరిరాజు వెలుగోటి కులసింధు
రాజు విద్వత్కవిభోజరాజు
శ్రీరాజగోపాల కృష్ణమహారాజు
నాస్థానకవి సంస్కృతాంధ్రకావ్య
ధుర్యుఁడు మల్లాది సూర్యనారాయణ
శాస్త్రి పాణినిముఖ్యశాస్త్రవేత్త
కైస్త్రవశకమునఁ గడవఁ బందొమ్మిది
వందల పదునాల్గువత్సరములు



గీ. జరగునానందమాఘమాసమున దృశ్య
కావ్యశాసన దశరూపకంబు ముంజ
జనవరాస్థానకవి ధనంజయునిపగిది
విద్వదనురంజకముగ నావిష్కరించె.

## గద్యము.

ఇది శ్రీహరితగోత్రాపస్తంబ సూత్రాధీత సకలతంత్ర రామస్వామిశాస్త్రిపౌత్త్రుండును, వేద వేదాంతజ్ఞాని శ్రీరామావధాని పుత్త్రుండును, శబ్దతర్కాద్వైతశాస్త్రధురీణుం డగుచర్ల బ్రహ్మశాస్త్రి శిష్యుండును సంస్కృతకవిజీవితోత్తరరామచరితాద్యనేక కృతి కర్తయు నగు మల్లాది సూర్యనారాయణశాస్త్రిచే రచియింపఁబడిన యాంధ్రదశరూపకం బను దృశ్యకావ్యశాసనంబున రసప్రకాశం బను చతుర్థప్రకరణము.

సర్వము సమాప్తము.

ఓమ్ తత్సత్

చెన్నపురి: వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారి
ఆదిసరస్వతీనిలయ ముద్రాక్షరశాలయందు
ముద్రితము—1915.

| పుట. | సూ. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 78 | 65 | పీఠమర్దనాయికా | పీఠమర్దనాయిక. |

# ప్రకటన.

| | రు. | అ. |
|---|---|---|
| సంస్కృతకవిజీవితము. 58 మహాకవుల చరిత్రము, వారికృతుల విమర్శనమును, తెలుఁగున వ్రాయఁబడినది. ... | 1 | 0 |
| ఉత్తరరామచరిత్రనాటకము. ... | 0 | 10 |
| సత్యకీర్తినాటిక (చక్కనికల్పితకథ) ... | 0 | 8 |
| భవభూతినాటకముల తెలుఁగువచనము. ఇందు మహావీరచరిత్ర ఉత్తరరామచరిత్ర మాలతీమాధవములకథలు సులభశైలిని వచనముగా వ్రాయఁబడినవి. | 0 | 6 |
| స్త్రీధర్మబోధిని, నీతిపద్యకావ్యము. దొరతనమువారు పైప్రైమరీతరగతులకుఁ బఠనీయముగా నిర్ణయించిరి. | 0 | 2 |

మల్లాది సూర్యనారాయణశాస్త్రి.

# ప్రకటన.

| | | రు. | అ. |
|---|---|---|---|
| సంస్కృతకవిజీవితము. 58 మహాకవుల చరిత్రము, వారికృతుల విమర్శనమును, తెలుఁగున వ్రాయఁబడినది. | ... | 1 | 0 |
| ఉత్తరరామచరిత్రనాటకము. | ... | 0 | 10 |
| సత్యకీర్తినాటిక (చక్కనికల్పితకథ) | ... | 0 | 8 |
| భవభూతినాటకముల తెలుఁగువచనము. ఇందు మహావీరచరిత్ర ఉత్తరరామచరిత్ర మాలతీమాధవములకథలు సులభశైలిని వచనముగా వ్రాయఁబడినవి. | | 0 | 6 |
| స్త్రీధర్మబోధిని, నీతిపద్యకావ్యము. దొరతనము వారు పైస్త్రీమరీతరగతులకుఁ బఠనీయముగా నిర్ణయించిరి. | | 0 | 2 |

మల్లాది సూర్యనారాయణశాస్త్రి.

